# మన పండుగలు

## (ఎలా చేయాలో తెలుసా)




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# మన పండుగలు

## (ఎలా చేయాలో తెలుసా)


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (85) దశ అష్టాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**









ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38    ఏడవ ముద్రణ : జనవరి–2017

ప్రతులు : 1000    **వెల : 70 /-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
61) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
62) ఒక్కడే ఇద్దరు.

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ–దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!–నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
75) దేవుని రాకకు ఇది సమయము కాదా!
76) సాయిబాబా దేవుడా! కాదా?
77) విశ్వ విద్యాలయము
78) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
79) గీటురాయి
80) మూడు దైవ గ్రంథములు–మూడు ప్రథమ వాక్యములు
81) హేతువాద ప్రశ్నలు–సత్యవాద జవాబులు
82) భావము–భాష
83) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ
84) నాది లోచన–నీది ఆలోచన
85) దేవుని ముద్ర
86) ధర్మచక్రము
87) హిందూమతములోనే కులవివక్ష
88) యోహాను చెప్పిన జ్ఞానము
89) ప్రాథమిక జ్ఞానము.
90) రాజకీయము×రాజకీయము
**91) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**92) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**93) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**94) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
2. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము.
3. పాప క్షమాపణ ఎలా కలదు?
4. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్
7. తెలుగు-వెలుగు

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య



*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు–పాదరసము.
05. యుగము–యోగము.
06. నైజం–సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం–సైత్యం.
09. శైవము–వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి–సృష్ఠికర్త.
12. కాయ–పండు–కాయ.
13. జ్ఞానము–విజ్ఞానము.
14. వార–మాస–వత్సర.
15. సేకూవలి–కూలిసేవా.
16. ధర్మము–అధర్మము.
17. ఏక్‌నిరంజన్–అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు–ఆర్యులు.
22. ప్రభువు–ప్రభుత్వం.
23. భూతం–మహాభూతం.
24. ప్రభు–ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము–గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి–వికృతి.
29. మాట–మందు.
30. ఏకత–ఏకాగ్రత.
31. హరికాలు–హరచేయి.
32. పుట్టగోసి–మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు–అమాయకుడు.
37. మరణము–శరీరము.
38. ఎదమీదముద్ర–తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు–అద్వితీయుడు.
40. బయటి సమాజం–లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ–పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము–మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి–గురువు దైవము.
47. సమాధి.
48. మతము–పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్–హదీసు.
51. పుట్టుట–గిట్టుట.
52. తల్లి.
53. గోరు–గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు–హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. త్రైత సిద్ధాంతము.

*DVD'S*

62. కర్మ లేని కృష్ణుడు–
కర్మ ఉన్న కృష్ణుడు.
63. సహజ మరణం– తాత్కాలిక మరణం.
64. స్త్రీ–పు / లింగము.
65. దేశం మోసం–దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం–
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు–
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు–రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ – నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము–ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ–దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు–ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు–ఆరు–తొమ్మిది.
89. 6–3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి–భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము–అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి–శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము – బోధ.
110. ఆట – దోబూచులాట.
111. ప్రజలు – మానవులు.
112. ఆస్తి – దోస్తి.
113. దంతము–అంతము.
114. మాయ మర్మము– ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
116. అంతిమ గ్రంథములో
ప్రథమ వాక్యములు.
117. అదురు–బెదురు.
118. శవము–శివము
119. ధర్మచక్రము
120. గ్రాహిత శక్తి
121. ఆధ్యాత్మిక ప్రశ్నలు – జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా. T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘుడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:7680065963, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది.
త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము,
పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు.
త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది.
త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత
గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు
ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి.
త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక
భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము.
త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా
యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు.
త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన
త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను
చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని
మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి.
అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా
హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము
తెలియదు.

# మన పండుగలు

అనంత విశ్వములో శతకోటి జీవరాసులున్నాయని కొందరను చుండగా వినియున్నాము. అది ఏదో పాతయుగములోని మాటై ఉండవచ్చును. ఇపుడు ఒక భారతదేశములోనే 100 కోట్ల మనుషులే ఉన్నారు. ఎన్నో జాతుల జీవరాసులనన్నిటిని కలిపి నూరుకోట్లు అన్నారంటే బహుశ ఆ సంఖ్య కృతయుగములోనిదై ఉండవచ్చును. కృతయుగములోనే కొద్ది సంఖ్యలోనే మనుషులున్న కాలములోనే, మనుషులలో జ్ఞానము సన్నగిల్లిపోయి అజ్ఞానము పెరిగి పోయినది. మానవుడు అంతర్ముఖ ధ్యాసను వదలిపెట్టి, బాహ్య ధ్యాసలో పడిపోయాడు. కోటి విద్యలు కూటికొరకేనన్నట్లు అన్ని పనులు బయటి ఆహారమునకే చేయను మొదలు పెట్టాడు. అటువంటపుడు తన కంటికి కనిపించు ఫలితము మీద ధ్యాసను పెంచుకొన్నాడు. కనిపించని ఫలితమైన పాపపుణ్యముల మీద ఏమాత్రము ధ్యాసను పెట్టలేకపోయాడు. అటువంటి సమయములో మనుషులలో ఆధ్యాత్మిక దృష్ఠిని పెంచడము కొరకు మరియు పాపభీతిని పెంచుటకొరకు ఆనాటి జ్ఞానులు ఎన్నో విధముల మనుషులలో జ్ఞాన చైతన్యమును కల్గించుటకు పూనుకొన్నారు. అందులో భాగముగా ప్రతి మనిషి తన జీవితములో వెనుతిరిగి చూచుకొనునట్లు, తన గత జీవితములో ఏమి చేశాను, ఏమి సాధించానని బేరీజు వేసుకొనునట్లు చేశారు. ఏ విషయమైనా మనిషికి బాగా అర్థము కావాలంటే దానిని ఇంకొక దానితో పోల్చి చూపితే బాగుంటుందని తెలిసిన పెద్దలు చెట్టుకు వచ్చు ఫలితము లేక ఫలము అయిన పండును ఉదాహరణగా చూపుచూ ఒక ప్రక్రియను మనుషుల మధ్యలో పెట్టారు. చెట్టుకు సంవత్సరమునకు కాయలు కాయడము, పండుగా మారడము అందరికి తెలిసిన విషయమే. అందరికి తెలిసిన విషయముతో సమానముగా పోల్చి చూపడము వలన అందరికి బాగా అర్థమగునను ఉద్దేశ్యముతో పెద్దలు ఆ ప్రక్రియను **“పండుగ”** అను పేరుతోనే ఆచరించు

నట్లు చేశారు. ఒకప్పుడు ఒకే ఇందూమతముగా నున్న మానవజాతి నేడు అనేక మతములుగా చీలిపోయి ఉన్నప్పటికీ పూర్వము కృతయుగము లోనే పెద్దలు పెట్టిన ఆచరణ ఈనాటికి చెక్కుచెదరక ఉన్నది. నేటికిని మనుషుల మధ్యలో ఆచరణ ఉన్నప్పటికీ ముఖ్యమైన అర్థము లేకుండ పోయినది. అర్థములేని ఆచరణ వలన ఎటువంటి ప్రయోజనము లేకుండ పోయినది. నేడు మనుషుల మధ్యలో వ్యర్థముగా మిగిలిపోయిన ఆనాటి పెద్దల ప్రక్రియను అర్థమగునట్లు వివరించుకొందాము.

కాలము పవిత్రమైనది మరియు దైవస్వరూపమైనది. ఒక మాటలో **కాలమే నేనని** దేవుడు కూడ గీతయందన్నాడు. కాలమెంత గొప్పదైనా మనకు సహజమైనదిగా ఉన్నది. దానివిలువ ఏమాత్రము కనిపించకున్నది. ఎవరూ కాలమును గురించి ఆలోచించడము లేదు. కొందరు పెద్దలు కాలము విలువైనదని గ్రహించి టైమ్ ఈజ్ మని (కాలము డబ్బుతో సమానము) అన్నారు. ఆ మాటకంటే కూడ కాలము విలువైనదని మేమనుచున్నాము. ఎందుకనగా! పోయిన డబ్బును తిరిగి సంపాదించ వచ్చును. కానీ జరిగిపోయిన కాలమును తిరిగి సంపాదించలేరు.

ప్రతి జీవరాసి కాలమును అనుభవిస్తూ ఉన్నది. ప్రతి జీవరాసి శరీరముతో ఎన్నో మంచి, చెడుపనులయందు కాలమును వినియోగించు చున్నది. జరిగెడి కాలమందు మంచిపని జరిగినా, చెడ్డపని జరిగినా చేసెడి జీవరాసికే వాటి ఫలితమూ, అనుభవమూ దక్కును. కానీ కాలమునకు మంచి చెడ్డతో ఏమాత్రము సంబంధములేదు. అందువలన కాలము దైవస్వరూపమైనదేననుటలో సందేహము లేదు. కాలము ఒక మనిషికి, ఒక జాతికి, ఒక దేశమునకే పరిమితమైనది కాక యావత్ జగతికంతటికి వినియోగింపబడుచున్నది. ఉదాహరణకు ఇండియాలో ఉన్న వ్యక్తికి, అమెరికాలో ఉన్న వ్యక్తికి కాలమొకే విధముగ ఉన్నది. అందరికీ

సమానమైన కాలములో వారివారి పనులూ, వారివారి అనుభవములు వేరువేరై ఉండవచ్చును అయినా కాలమందరికి ఒక్కటే. అందువలననే కాలము దైవస్వరూపమని చెప్పవచ్చును.

జన్మతో ప్రారంభమైన కాలము మరణముతో అంతమౌచున్నది. జన్మకు, మరణమునకు మధ్యనున్న కాలమును జీవితము లేక జీవిత కాలము అంటున్నాము. జీవిత కాలములో కొందరు మంచిగ, కొందరు చెడ్డగ జీవితమును సాగించుచున్నారు. అనంతమైన కాలములో ఎవరు ఎన్ని విధముల బ్రతికినా చివరకు వారు కాలగర్భములో కలసిపోవువారే.

జీవితకాలములో ప్రత్యేకత కల్గిన వారిని చిరంజీవులని అనడము జరుగుచున్నది. వారి జీవితకాలము కొద్దియే అయినప్పటికీ వారి జీవిత ధ్యేయము చాలా గొప్పదిగ ఉండును. వారు అందరిలాగకాక జీవితములో ప్రత్యేకమైనదియే సాధించి ఉందురు. అటువంటి వారిని కారణ జన్ములు, చిరంజీవులని అనుచున్నాము.

ఈ కాలములో కాలమంటే ఏమిటి? అని యోచించక వృథాగా కాలము గడిపి **పుట్టలోని చెదలు పుట్టదా! గిట్టదా!** అనులాగున ఏమిటికి సార్థకము లేని జీవితమును చాలామంది గడుపుచున్నారు. క్షణ క్షణము మన శరీరములో మార్పు జరుగుచున్నది. క్షణ క్షణ మార్పుల చేతనే బాల్యమునుండి వృద్ధాప్యమునకు శరీరము చేరుకొనుచున్నది. దినదినమూ కాలము జరుగుకొలది మృత్యువు దగ్గరవుచున్నది. జరుగు కాలములో ఏదో ఒక దినము మృత్యువును చేరవలసిందే. అయినప్పటికి జరిగిపోవు కాలమును దృష్టిలో పెట్టుకొని మరణము దగ్గరవుతున్నది కదా! అని ఎవరు తలవడము లేదు. మనము తలచిన, తలవకుండిన కాలము ఆగునది కాదు, మృత్యువు రాకమానదు.

మానవుని దృష్టిలో విలువ లేని కాలమునకు విలువ కల్పించాలనీ, జరిగిన కాలము తిరిగిరాదని అర్థమగునట్లు చేయాలనీ, నీ జీవిత కాలము కొద్ది పాటియేననీ, ఆ కొద్దిపాటి కాలము కూడ ఖర్చయిపోతున్నదని ఆలోచించాలనీ, జరిగిన నీ జీవితకాలములో ఏమి సాధించానని యోచించాలనీ, అసలు కాలమంటే ఏమిటో కనువిప్పు కల్గించాలని పెద్దలు మనుషుల చేత ఆచరింపజేసిన ప్రక్రియనే **పండుగ** అనుచున్నాము. కాయ కొంతకాలమునకు **పండుగ** మారుచున్నది. కాయ అనునది **పండుగ** పరివర్తన చెందుట మనకు పూర్తిగ తెలిసిన విషయమే. మార్పు వచ్చిన పండునుండి పుట్టిన పదమే **"పండుగ".**

సాధారణముగ ప్రకృతి సిద్ధముగ ప్రతి చెట్టు సంవత్సరమున కొకసారి పుష్పించి కాయలు కాయడము సహజము. చెట్టునుండి కాయ కాచి పండుగ మారుటకు వ్యవధి సంవత్సర కాలము పట్టుచున్నది కదా! కావున చెట్టును ఉదాహరణగా తీసుకొందాము. చెట్టు నిండు జీవితములో ఒకసారి కాయకాచి ఫలముగా మారుటకు ఒక సంవత్సర కాలము గడచిపోవుచున్నది. అట్లే మానవుని జీవితములో ఒక సంవత్సర కాలము గడచిన దానిని పండుగ అనుచున్నారు. కాయ పండుగ మారినంత కాలమని పండుగయని పేరు పెట్టారు. చెట్టులో కాయ పక్వమునకొచ్చినంత కాలమనీ, అదియే మానవ జీవితములో **'పక్వదినమనెడివారు.'** ఇప్పుడు పక్వదినము అను మాటను పర్వదినము అంటున్నాము. ఈ విషయమును వివరముగా తెలుసుకొంటే ఈ విధమైన అర్థము గలదు.

చెట్టు సంవత్సరకాలమునకు తన సారమైన ఒక పండునిచ్చి పరులకు ఉపయోగపడినది. నీవు ఇతరులకు ఏ విధముగ ఉపయోగపడినావు అని గుర్తువచ్చునట్లు, సంవత్సర కాలములో తాను సాధించిన ఫలితమేమి అని యోచించునట్లు ఒక దినమును పండుగ అను పేరుతో ఉంచారు.

నిత్య జీవితములో మునిగి పోయిన మనిషి కాలమును మరచి పోయాడు. కావున నీ జీవితములో కొంత కాలము గడచిపోయినదని గుర్తింపు వచ్చునట్లు కూడ పండుగనుంచారు. ఉదాహరణకు యుగాది పండుగను తీసుకొందాము. పోయిన సంవత్సరము యుగాది పండుగ చేశాము, ఈ సంవత్సరము కూడ చేయుచున్నాము. దీనినే క్రొత్త సంవత్సరము అని కూడ అనుచున్నాము. పూర్వము పెద్దలు తమ జీవితములో ఒక సంవత్సరము గడిచిపోయినదనీ, మరియొక క్రొత్త సంవత్సరము జరుగబోవు చున్నదనీ, జరిగిన సంవత్సరములో నేనేమి **జ్ఞానమును** సాధించానని వెనుతిరిగి చూచుకొనెడివారట. అందువలన ఆ యుగాది దినమందు నిత్య జీవిత కార్యములలో లగ్నముకాక అన్ని వదలి విశ్రాంతి తీసుకొని, వెనుకటి కాలమును గూర్చి యోచించి ఈ సంవత్సర కాలములో నేనేమి చేశాననీ, దైవమార్గములో ఏమి సాధించాననీ, ఈ కాలములో చెడుగా ప్రవర్తించానా, మంచిగా ప్రవర్తించానాయనీ లెక్కవేసుకొనెడి వారు. ఆ దినమంతయు తన ఆధ్యాత్మిక జీవితమును గురించి యోచించుచు గడిపెడివారు. మిగతా దినములలో ఆహారమును గురించి యోచించినట్లు ఆ దినము ఏమాత్రము తిండి గుడ్డ ధ్యాస రాకుండునట్లు, బయటి జీవితము యొక్క ఆలోచన ఏమాత్రము లేకుండునట్లు, కొంత కాలమునకు ముందే అన్ని ఆహార పదార్థములు అన్ని దినములకంటే మంచిగ ఉండునట్లు సమకూర్చుకొనెడివారు. ఆహారమందు కానీ, గుడ్డలందు కానీ చింతలేకుండ సమకూర్చుకొని ప్రక్క పనులు అన్నియు వదలివేసి జరిగిపోయిన కాలమును గూర్చి యోచించడము ఆనాటి కర్తవ్యమై ఉండెడిది. ఆ దినము తన జీవిత కాలమును గూర్చి యోచించునది కావున జ్ఞాన సంబంధమైన దినముగ భావించుకొనెడి వారు. నా జీవితము ఇంతకాలము ఈ విధముగ గడచిపోయినది, జరుగబోవు పండుగ కాలము వరకు సారాంశమైన

దైవసంబంధమైన జ్ఞానజీవితమును గడుపవలయునని కోరుచు ప్రార్థనా మందిరములలోనో, ఇంటిలోనో దేవుని ఆరాధనలు జరిపెడివారు.

నీ జీవితము కొంత కాయనుండి పండుగ మారిపోయినదని, ఎప్పుడు రాలిపోతుందో చెప్పలేమని యోచించుటకు గుర్తింపుగ ఆనాడు పెద్దలు పండుగనుంచారు. నిత్య జీవితములో లగ్నమైయున్న మానవునికి నీ ఆయుస్సు కొంత గడిచిపోయినదనీ, గడిచిన కాలములో పుట్టి ఏమి సాధించావని తెల్పుటకే పెద్దలు పండుగనుంచారు. ఈ పండుగలు ఒక్క మతములో కాక అన్ని మతములందు ఉండడము గమనింపదగ్గ విషయము. ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క పండుగ నిర్ణయించబడి ఉన్నది. పూర్వము అన్ని మతముల పెద్దలు ఒకే భావముతో పండుగలు ఉంచారో లేదో చెప్పలేము. అయినా పండుగ అంటే కాయలాంటి నీ జీవితము కొంత పరిపక్వతకు వచ్చి పండు అయినదని తెలుపునదే పండుగ.

కాయ అనగా పక్వమునకు రానిదనీ, మాగక పచ్చిగయున్నదనీ అందరికి తెలుసు. కాయ అనునదేదైనవుంటే అది తప్పక పండుగా మారితీరవలసిందే. ఎటువంటి కాయ అయినా పక్వానికి వచ్చినపుడు దానిని పండు అనుచున్నాము. కాయ పండుగ మారవలసినది ఒక చెట్టుకే కాదు మనిషికి కూడ గలదు. జీవితమను కాయనుండి మోక్షమను పండుగా మనిషి మారవలసియున్నది. ఒక జీవి మోక్షమను పండుగా మారనంత వరకు జీవితమను కాయగా ఉండవలసినదేనని తెలుపుటకు జీవితములో జీవి నివసించు శరీరమును **"కాయ"** అని పెద్దలన్నారు. తెలుగు భాషలో పదమునకు అందమును చేకూరునట్లు అనేక పదములకు చివరిలో **"ము"** ను చేర్చడము సహజము. ఉదాహరణకు **దీప** అను పదమునకు **ము** ను చేర్చి దీపము అనినట్లు అదే విధముగా **కాయ** అను పదమునకు **ము** ను చేర్చి **"కాయము"** అన్నారు. అందువలన కొన్ని పదములలో చివరి

అక్షరమునకు అర్థముండదని తెలియవలెను. దీపకాంతి అన్నపుడు 'ము' ను అర్థములేనిదిగా ప్రక్కన పెట్టాము కదా! అలాగే శరీరరంగు అనునపుడు అతని యొక్క కాయ ఛాయ అనుచున్నాము కదా! అపుడు కాయము చాయ అనలేదు కదా! అంటే అక్కడ కాయ ప్రక్కన **'ము'** కు విలువలేదన్న మాట. కావున మానవ శరీరమును కాయము అని అనినప్పటికీ అది కాయగానే లెక్కించవలెను. మానవ దేహము కాయలాంటిదే అనుకొన్నాము కదా! అందువలననే కొందరు ఆత్మను తెలిసిన పెద్దలు ఆధ్యాత్మిక పద్ధతిలో **"కాయ"** మను పుట్టలోన చందమామ అని ఒక తత్త్వమును కూడ వ్రాశారు. కావున మన శరీరము కాయలాంటిదే అది **"పండుగ"** మారవలసిందే. ఆ విధానమును తెల్పు బయటి ప్రక్రియయే నేడు మన మధ్యలోనున్న పండుగ అని తెలియవలెను.

ఇప్పటి కాలములో అన్ని మతముల పండుగలు ఒకే పద్ధతి, ఒకే భావముగ ఉన్నవనుకుంటాము. పండుగ అంటే అన్ని మతముల వారు క్రొత్త దుస్తులు ధరించడము, మంచి తిండి తినడము, ఏదో ఒక దేవున్ని ఆరాధించడము, మ్రొక్కడము పరిపాటిగ ఉన్నది. కొందరు మాత్రము తిండి కోసమే పండుగ అన్నట్లు అన్ని దినములకంటే ఆ దినము ఎక్కువ తిని ఆయాసపడుచున్నారు. కొందరు ఊయల ఊగడమో, ఆటలు ఆడడమో చేయుచు సంతోషపడుచున్నారు. కొందరు తాగి తందనాలాడుచున్నారు. కొందరు పేకాటయందే అన్యచింత లేకుండా దినమంతా గడుపుచున్నారు. కొందరేమో దేవుని మ్రొక్కుటకు లైసెన్సు దినమన్నట్లు ఆ ఒక్క దినము ఇష్టముండినా లేకుండినా మ్రొక్కి చేతులు దులుపుకొంటున్నారు. కొందరు ఉద్యోగస్తులు ఉద్యోగమునకు సెలవు దినముగ ఉండుననీ, పండుగంటే డ్యూటీ (పని) లేని దినమని సంతోషిస్తున్నారు. కొందరు వ్యాపారస్తులు గడచిన సంవత్సరము ఎంత పాపము, ఎంత పుణ్యము సంపాదించామని

లెక్కించక, డబ్బు ఎంత సంపాదించామని లాభనష్టాల లెక్కలు చూచు కొనుచున్నారు.

పూర్వము పెద్దలు పెట్టిన భావమంతయు మట్టిపాలై పండుగంటే ఏమిటో అసలైన అర్థమే తెలియక పోయినది. పూర్వము సంవత్సరమున కొక పండుగ ఉండెడిది. తర్వాత కొంత కాలమునకు మనిషి జ్ఞానిగా మారాలంటే మరికొన్ని పండుగలవసరమని నిర్ణయించిన పెద్దలు కొన్ని ముఖ్యమైన పండుగలను ఉంచారు. పెద్దలు అర్థముతో కూడుకొన్న పండుగలను ఉంచగా అర్థముతో ఆచరించని ప్రజలు పెద్దలు చెప్పని వాటిని కూడా పండుగలుగా ఆచరించుచున్నారు. ఆ నేపద్యములోనే ఇపుడు సంవత్సరమునకెన్నియో లెక్కలేనన్ని పండుగలు ఉన్నవి. పూర్వమొక్కడే దేవుడను భావముండెడిది. ఇపుడు అనేకమంది దేవుళ్ళైనారు, అనేక పండుగలైనవి. మానవ జీవితమునకు కొలబద్ధ పండుగని ఏమాత్రము యోచించని స్థితిలో మనము ఎన్నియో పండుగలు చేసాము, ఇక ఎన్నియో పండుగలురానున్నవి. ఇప్పటినుండి ఏ విధముగ చేయదలచుకొన్నారో! మీరే బాగా యోచించుకొని పండుగలు చేయండి.



# యుగాది

కంటికి కనిపించు ఈ జగత్తంతయు ఒక రోజు ప్రారంభమై ఆనాటినుండి కొనసాగుచూనే ఉన్నది. ప్రపంచములోని జీవరాసులన్నిటికి చావు పుట్టుకలు గలవు. అందువలననే ఈ జీవరాసులన్నిటినీ జగతి అంటున్నారు. **'జ'** అనగ పుట్టునదని **'గతి'** అనగా చావునదని అర్థము గలదు. జగతి అను శాశ్వత నామమును గల్గిన ఈ జీవ సముదాయము ఏదో ఒక రోజు పుట్టి, ఏదో ఒక రోజు లేకుండ పోవునదని అందరు

తెలుసుకోవలయును. ఒక మనిషి పుట్టి కొంతకాలముండి చనిపోవుట అందరికి తెలిసిన సత్యమే. అతను ఉండు కొంత కాలమును అతని ఆయుస్సు అంటున్నాము. మనిషి ఆయుస్సుకు కొలమానముగ నిమిషములు మొదలుకొని సంవత్సరముల వరకు గలవు. అట్లే పుట్టి కొంత కాలముండి పోవు ప్రపంచమునకు కూడ ఆయుస్సు కలదు. దాని కొలమానము యుగముల లెక్కలో ఉండును. మనిషి పుట్టిన దినమును జన్మదినమనియు, జాతకమనియు చెప్పుచుందురు. అట్లే ప్రపంచము పుట్టిన దినమును **'యుగ ఆది'** అనెడివారు. దానినే కొంతకాలమునకు **'యుగాది'** అనెడివారు. కాలము జరుగుకొద్ది యుగాది కూడ పోయి **'ఉగాది'** అయినది. రాబోవు కాలమునకు ఇంకా ఏ పేరుగా మారిపోతుందో తెలియదు.

నేటి కాలములో కొందరు తమ పుట్టిన రోజును ప్రతి సంవత్సరములో పండుగ చేసుకొనుచుందురు. తీపి పదార్థములు పంచి తన పుట్టిన దినమని తెలియజేయుచుందురు. జన్మదిన వేడుకలు ప్రస్తుత కాలములో ప్రబలిపోయినవి. కాని పూర్వము ఎవరూ తమ జన్మదిన వేడుకలు జరుపుకొన్నట్లు చరిత్రలో లేదు. శ్రీకృష్ణాష్టమి, శ్రీరామనవమి వారు బ్రతికి ఉన్నపుడు వారు చేసుకొన్నట్లు ఆధారములు లేవు. పూర్వకాలములో వ్యక్తిగత పుట్టిన దినములు ఎవరు జరుపుకోక, సమిష్ఠిగ ప్రపంచము యొక్క పుట్టిన దినమును చేసుకొనెడివారు. ఆ దినమునకే **'యుగ ఆది'** అనిపేరు పెట్టి అన్నిటికంటే మిన్నగా, దానికంటే మించిన పండుగలేనట్లు చేసుకొనెడివారు. కాలము జరుగుకొలది తర్వాత చాలా పండుగలు తయారై అన్నిటిలాగే ఇదీ ఒక పండుగైనది. ఇంకనూ కొంతకాలము జరిగిపోతే ఈ పండుగ లేకుండ పోయే స్థితి ఏర్పడుతుందేమో! ఇప్పటికే కొంత పేరు మారింది, కొంత ఆచరణయు మారినది. విదేశీ

సాంప్రదాయమైన జనవరి మొదటి తేదీ సంవత్సరాది అయినది. రాబోవు కాలములో హిందూ సమాజములో యుగాది ఉంటుందో లేదో చెప్పలేము.

ఇందువులు హిందువులుగ మారి వారి సంస్కృతినే మరచి పోయినా, ఆదిలో పుట్టిన ఇందువుల జాతి మరి ఏ ఇతర మతములుగ మారిపోయినా, ఇందూ సంస్కృతిని మానవులు వీడినా, ఆ సంస్కృతి మనుషులను వదలలేదని చెప్పుటకు కొన్ని తార్కాణములు మిగిలి ఉన్నవి. వాటిలో ముఖ్యమైన ఒకదానిని వివరించుకొందాము.

ప్రస్థుత కాలములో భూమండలములో ఎన్నో దేశములు గలవు. అట్లే ఎన్నో మతములూ, ఎన్నో సంస్కృతులూ, ఎన్నో భాషలూ, ఎన్నో సాంప్రదాయములు గలవు. భూమి మీద మానవులందరు ఎన్ని రకములుగ ఉన్ననూ, అందరికి పగలు రాత్రి ఒక్కటే. అంతేకాక వారమునకు ఏడు దినములు, నెలకు ముప్పైరోజులు, సంవత్సరమునకు పండ్రెండు నెలలు సర్వసాధారణముగ ఉన్నాయి. ఇంకనూ ముఖ్యముగ తెలుసుకోవలసినదే మనగా! ప్రపంచమునకంతటికి వారములోని పేర్లు ఒక్కటిగనే ఉన్నవి. ఏ దేశమువానికైన, ఏ మతమువానికైన వారములోని దినముల పేర్లు ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శనివారములు కావడము విశేషము. ప్రపంచములో ఇందువులు మొట్టమొదట ఏర్పరచిన పేర్లే మొత్తము ప్రపంచమునకంతటికి వర్తించడము ఇందువులెవరైన గర్వింపదగ్గ విషయము.

పూర్వము సృష్ఠి మొదలైన దినము ఆదివారము. ఆదివారము వారములో మొదటి దినమై ఉండుట వలన, ఆ దినమును ప్రతివారము చిన్న పండుగగ చేసుకొనెడివారు. ప్రపంచము ఆదిలో మొదలైన దినమునకు ఆదివారమనే పేరు పెట్టారు. ఆది అనగ మొదటిది అని అర్థము. సృష్ఠి

ఆదివారముతో మొదలగుట వలన ఆ దినము అందరికి చిన్న పండుగలాగ ఉండెడిది. ఆ దినము పనులు మాని సంతోషముగ కాలమును గడుపుచూ, పిండి వంటలను చేసుకొని, దేవునికి నైవేద్యము పెట్టి తాము తినెడివారు. వారములో ఆరు దినములు పనిచేస్తూ, ఒక మొదటి దినము పనిచేయక పండుగ చేసుకొనెడివారు. పూర్వము ప్రతి ఆదివారము పండుగ వాతావరణము కల్గియుండెడిది. ఇప్పటికీ కొంతమార్పుతో ప్రతి ఆదివారము అందరికి విశ్రాంతి దినమై మాంసాహారులకు పండుగవలెనే ఉన్నది. పూర్వము ఆదివారమంటే సృష్ఠి మొదటి దినమను పవిత్రభావము అందరికి ఉండి ఆ దినమును పవిత్రముగనే గడిపెడివారు. నేడు ఆదివారమంటే దురభ్యాసపరులకు ఇష్టారాజ్యముగ ఉండును. ఎలాగైతేనేమి మొత్తము మీద ఆదివారము యొక్క ప్రత్యేకత ఈ నాటికి మిగిలి ఉన్నది. ఇలా భూమి మీద అన్ని దేశముల ప్రజలకు వారములు ఏడై, అందులో ఆదివారము మొదటివలె ప్రత్యేకత కల్గియుండడము గమనిస్తే, కాలగమనములో ఎవరెలా మారినా ఇందువుల పవిత్రదినము నేటికినీ అందరికి సెలవుదినమై కొంత పండుగవలెనుండడము చూస్తే, మనుషులు సాంప్రదాయమును వదలినప్పటికి, సాంప్రదాయము మనుషలను వదల లేదని తెలియుచున్నది. ప్రపంచము మొత్తము ఇందువుల సాంప్రదాయములు ఇలా అందరి వద్ద ఉండడమును బట్టి సృష్ట్యాదిలో అంతటా ఇందువులే ఉండెడి వారని, తర్వాత అది మారుచు చివరకు అనేక మతములైనప్పటికీ గుడ్డలోని ఇంగువ పోయినా గుడ్డకు ఇంగువవాసన పోనట్లు, మనుషులలో ఇందుత్వము పోయినా ఇందుత్వ వాసన మనుషులలో పోకుండ కొంతైన వారముల రూపములో మిగిలి ఉన్నదని తెలియుచున్నది.

ఆదిలో దేవునివలన నెలకొల్పబడిన జ్ఞానము చేత తయారయినదే ఇందుత్వము. ఇంత భూమండలము మీద, ఇన్ని దేశముల మధ్య ప్రత్యేకించి

మనము నివసించు ఈ దేశములోనే ఇందువులు ప్రకాశించారు. అందువలన ఈ దేశము ఇందూదేశమైనది. ఈ గడ్డమీద మనము నివాసముండి, మన పూర్వీకులకు వారసులుగ ఉంటూ, మన సాంప్రదాయ మేమిటో మనకే తెలియకపోవడమూ, సృష్ట్యాదిలో ఏ దినము మొదలైనదో దాని ప్రత్యేకత ఏమిటో తెలియకపోవడమూ, చివరకు వారమునకొక మారువచ్చు ఆదివారము కూడ ఏమిటో మనకు తెలియకుండ పోయి కేవలము సెలవు దినమనుకోవడమూ, ఆదివారమే సెలవు దినమెందుకైనదని యోచించక పోవడమూ, ఈ విషయమును స్వాములు, గురువులు, పీఠాధిపతులు చెప్పకపోవడమూ, అన్నిటిని పరిశీలించి చూచితే ఆది దినమును గురించి తెలియని మనలను చూచి మన పూర్వీకులు బాధపడ వలసిందే. వారి వారసులమైనందుకు మనము సిగ్గుపడాల్సిందే.

ఇప్పటికైన మించిపోయినది లేదు. **'ఆది'** లో ప్రారంభమైనది కావున ఆ దినమునకు **'ఆది'** వారమని పేరు గల్గినదని తెలిసినవారమై, సృష్టి ఆదిలో మొదలైన ఆదివారమే యుగాదిగ అప్పుడప్పుడు తిరిగి వస్తున్నదనీ, మిగతా దినములలో వచ్చు యుగాదులకంటే ఆదివారము వచ్చు యుగాదే స్వచ్ఛమైన **'యుగాది'** అని నీవు తెలుసుకొని ఇతరులకు తెల్పుటకు ప్రయత్నించవలెను. నీవు నిజముగ ఇందువు యొక్క వారసునివైతే, ఆదిలో ఆదివారముతో మొదలైన యుగాది తిరిగి ఇపుడు వస్తుండడము వలన ఆ దినమును పవిత్రముగ గడుపవలెనని ప్రయత్నించుము. ఆదిలోని రహస్యములను తెలుసుకొనుటకు ప్రయత్నించుము. ఆ దిన కాలమును కథలతో, కవిత్వములతో, పాటలతో, పద్యములతో, నాటకములతో పంచాంగ శ్రవణముతో వ్యర్థముగ గడపక, దేవుని జ్ఞానముతో గడుపవలెను. అసలైన ఇందూ వారసుడవగుటకు, ఇందువుగ జీవించుటకు నీయందు ఇందుత్వము కొంచెమైన సజీవముగ ఉండుటకు, యుగాది అను పేరు

కూడ భ్రష్టుపట్టి ఉగాదిగ పిలువబడు నేటికాలములో తిరిగి **'యుగాది'** యొక్క ప్రత్యేకతలను చాటి చెప్పవలెను. ఆ దినము క్రొత్తగుడ్డలు ధరించడమే కాక, అది సృష్టి ఆదిలోనే క్రొత్తదినమనీ, మొదట మొదలైన దినమని వివరించి, తెలియని వారికి తెలియజేయవలెను.

ఇందువులుగా (హిందువులుగా) నున్నవారు కొందరు నేటికినీ యుగాది పండుగను కొంత గొప్ప భావముతోనే చేయుచున్నారు. యుగాది రోజు శుచిగా శుభ్రముగాయుంటూ భోజనమునకంటే ముందు యుగాది పచ్చడిని ప్రసాదముగా తీసుకొంటున్నారు. యుగాది పచ్చడిని తప్పనిసరిగా ఆ దినము తీసుకోవలెనని పెద్దలు పూర్వమే తెలిపియున్నారు. యుగాది అంటే అర్థము తెలిసినది, కానీ పచ్చడికి ఏమైనా ప్రత్యేకతయుందా? అని కొందరడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! **పూర్వము ఇపుడు మనమనుకొను పచ్చడిని పచ్చడనక ప్రసాదము అని అనెడివారు.** ప్రసాదము పోయి పచ్చడైనది. వాస్తవానికి దానిని దేవుని పూజలో పెట్టి పూజ అయిపోయిన తర్వాత కుటుంబములోని వారందరికి పంచెడివారు. అందరు గొప్ప భావముతో ప్రసాదముగా తీసుకొనెడివారు. అప్పటి కాలములో యుగాది ప్రసాదమును గురించి వారి భావము ఏమిటో కొంత వివరించుకొందాము.

యుగాది సృష్ఠి ఆదికి గుర్తని అందరికి తెలుసు. సృష్ట్యాదిలోనే అన్నీ పుట్టాయనుటకు గుర్తుగా మామిడిచెట్లు, వేపచెట్లు మొదలగు చాలా చెట్లు పూత పూయును. పూత పూసి పూతలోనుండి కాయ తయారగుట యుగాది సమయములోనే జరుగును. పూత, కాయను క్రొత్త సృష్ఠికి నిదర్శనముగా దేవుడుంచాడు. **పూతనుండి పుట్టినది "కాయ", గర్భము నుండి పుట్టునది "కాయ"ము.** కాయగానీ, కాయముగానీ సృష్ఠి ఆదిలో దేవుని చేత తయారైనవే. అందువలన దైవసృష్ఠి అయిన జగతి అంతయు

యుగాదిలోనే పుట్టినవని తెలియజేయు నిమిత్తము చెట్లకు ఆ సమయము లోనే పూత పిందె వచ్చునట్లు దేవుడు చేశాడు. దేవుడు సృష్ఠించిన జీవులలో ఆరు మంచి గుణములు, ఆరు చెడు గుణములున్నట్లు దేవుడే చేశాడు. జీవులనగా మనుషులు కావచ్చును, జీవమున్న చెట్లు కావచ్చును. మనుషులలో ఆరు సంఖ్యలో గుణములనుంచిన దేవుడు అదే ఆరుసంఖ్యలో రుచులను చెట్లలో నింపి పంపాడు. వేపచెట్టులో చేదు, చింతచెట్టులో పులుపు, తుమ్మచెట్టులో వగరు, మిరపచెట్టులో కారము మొదలగు ఆరు రుచులను వివిధ చెట్లలో దేవుడే పెట్టాడు. యుగాది సమయములో పూయు పూతలు అన్ని రుచులు కల్గియున్నవి. అందువలన జ్ఞానమును తెలిసిన పెద్దలు ఆరు రుచులు కల్గిన పూతలను తెచ్చి దేవుని ముందర పెట్టి వాటినే ప్రసాదముగా స్వీకరించుచున్నారు. ఆ విధముగ చేయుటలో జ్ఞానుల భావము ఈ రకముగా ఉండెడిది. మాలోనున్న ఆరుగుణములకు ప్రతీకగా ఆరు రుచులున్న పూతలను దేవుడవైన నీకు చూపించుచున్నాము. ఆరు రుచులను మేము తిని లేకుండ చేయుచున్నాము. అదే విధముగా మాలోని ఆరు గుణములను లేకుండ చేసుకొంటామనీ, ఈ పని చేసి చూపించు చున్నామనీ పూర్వము జ్ఞానులనెడివారు. ఆ విధముగా ఆ ఆరు గుణములకు బదులుగా ఆరు రుచుల పూతలను ప్రసాదముగా చేసి తిని జీర్ణాశయములో జఠరాగ్నిలో కాల్చివేసినట్లు, ఆరు గుణముల కర్మలను తలలోని జ్ఞానాగ్నితో కాల్చివేయుదుమని వారి భావముండెడిది. ఈ విధముగా జరుగు షట్ రుచుల ప్రసాదములు కాలక్రమేపీ మారుతూవచ్చి ఒక్క వేపపూతను మాత్రము తీసుకొని మిగత రుచులకోసము బెల్లము, చింతపండు మొదలగు నవి అందులో కలిపి యుగాది పచ్చడి రూపముతో తీసుకొంటున్నారు. కొందరైతే పేరుకు వేపపూతను వేసి ఏమాత్రము చేదు కనిపించకుండునట్లు చెక్కర బెల్లము పెద్ద మోతాదులో వేసి పాయసము మాదిరి చేసుకొని

దినమంతా తింటున్నారు. అట్లు చేయుట వలన యుగాది ప్రసాదము యుగాది పచ్చడిగా మారిపోయి చివరకు యుగాది పాయసముగా మారిపోయినది. సనాతనముగా వచ్చు యుగాది పండుగ ఇందూ సాంప్రదాయములలో ముఖ్యమైనది. ఇందూసాంప్రదాయములలోని ప్రతి పనికి చాలా అర్థముండును. పెద్దలు పెట్టిన అర్థమును వదలివేసి అర్థములేకుండ మన ఇష్టమొచ్చినట్లు చేయు పనులు సాంప్రదాయములన బడవు. అందువలన యుగాదిని పెద్దలు చెప్పినట్లు, వారు చేసినట్లు ఇప్పటి నుండి మనమూ చేద్దాము. యుగాదిలో పూర్తి విశిష్టతాను గుర్తెరిగి, జగతి యొక్క పుట్టుక ఆ దినమే జరిగినదని తెలిసి, పవిత్రభావముతో ఆచరించితే అది నిజమైన యుగాది పండుగ అగును. అట్లుకాకపోతే యుగాది ఉగాదిగా, పండుగ దండుగగా మారిపోగలదు. అట్లు కాకుండ యుగాదిని నిజమైన ఇందువుల పండుగగానే అర్థము చేసుకొని చేద్దాము.



# భోగి - మంటలు

భోగిమంటలను మాటను బహుశా సంక్రాంతి పండుగ సందర్భములో వింటుంటాము. యుగాది పండుగకు ప్రత్యేకత ఉన్నట్లే భోగిపండుగకూ సంక్రాంతి పండుగకు కూడ ప్రత్యేకత గలదు. యుగాదికి గానీ, సంక్రాంతికి గానీ ఆధ్యాత్మికతను, గ్రహముల ప్రయాణమును బట్టి ప్రత్యేకత గలదు. సూర్యుడు కాలచక్రములో కటకరాసి యందు ప్రవేశించినపుడు కటక సంక్రమణము అనియూ, అదే విధముగ సూర్యుడు మకరరాసిలో ప్రవేశించినపుడు మకర సంక్రాంతి అనియూ మన పెద్దలు చెప్పుచుందురు. ఈ రాసులనునవి ఏమిటి, ఎందుకున్నవి? అని యోచిస్తే కొంత సమాచారము తెలియగలదు. మనిషి యొక్క ఆధ్యాత్మిక పాఠములో

కాలచక్రమనునది చాలా ప్రాముఖ్యము గలది. కాలచక్రము మొత్తము పండ్రెండు భాగములుగ విభజింపబడి ఉన్నది. మానవుని జ్యోతిష్యము ఈ పండ్రెండు భాగములను ఆధారము చేసుకొని ఉన్నది. కాలచక్రములో యుండి కర్మను పరిపాలన చేయు నవగ్రహములు నిర్ణీతకాలము ప్రకారము ఈ కాలచక్రములోనే తిరుగుచుండును. అన్నిటికంటే ముఖ్యగ్రహము మరియు మొదటి గ్రహమైన సూర్యుడు కాలచక్రములో ఎక్కువ ప్రసిద్ధి చెందినవాడు. సూర్యుడు మొదటివాడైనందున ఆయనకు ఆదిత్యుడని కూడ పేరు గలదు. జ్యోతిష్యశాస్త్రములో సూర్యున్ని బట్టి గ్రహచారము నిర్ణయింపబడుచున్నది. కాలచక్రములోని పండ్రెండు భాగముల పేర్లు వరుసగ ఇలా కలవు. 1) మేషము 2) వృషభము 3) మిథునము 4) కర్కాటకము 5) సింహము 6) కన్య 7) తుల 8) వృశ్చికము 9) ధనస్సు 10) మకరము 11) కుంభము 12) మీనము. కాలచక్రమును దానిలోని భాగములను క్రింది పటములో చూడవచ్చును.

కాలచక్రములోని సగభాగములో సూర్యుని సంచారమున్నపుడు దానిని “ఆయణము” అంటారు. దీనినిబట్టి రెండు ఆయణములు గలవని,




కాల చక్రము



అవియే ఉత్తరాయణము, దక్షిణాయణము అని తెలియవలెను. సూర్యుడు కాలచక్రములోని ఒక్క భాగమును దాటుటకు ఒక నెలదినములు పట్టును. దీనిని బట్టియే మనకు నెలల పేర్లు కూడ నిర్ణయించారు. అవి వరుసగ 1) చైత్రము 2) వైశాఖము 3) జ్యేష్టము 4) ఆషాఢము 5) శ్రావణము 6) భాద్రపదము 7) ఆశ్వీయుజము 8) కార్తీకము 9) మార్గశీర్షము 10) పుష్యము 11) మాఘము 12) ఫాల్గుణము. కాలచక్రములో సూర్యుడు మేషరాసి భాగములో ప్రయాణించు ముప్పది దినములను చైత్రమాస మన్నారు 2) వృషభరాసిలోనున్న కాలమును వైశాఖమాసము అన్నారు. 3) మిథునరాసి కాలమును జ్యేష్టమాసము అన్నారు. 4) కర్కాటకరాసిలో ఉన్నపుడు ఆషాఢమాసము అన్నారు. 5) సింహరాసిలో ఉన్నపుడు శ్రావణ మాసము అన్నారు 6) కన్యారాసిలో ఉన్నపుడు భాద్రపదమాసము అన్నారు. 7) తులారాసిలో ఉన్నపుడు ఆశ్వీయుజ మాసము అన్నారు. 8) వృశ్చిక రాసిలో ఉన్నపుడు కార్తీకమాసము అన్నారు. 9) ధనస్సు రాసిలో ఉన్నపుడు మార్గశీర్షమాసము అన్నారు. 10) మకర రాసిలో ఉన్నపుడు పుష్యమాసము అన్నారు. 11) కుంభరాశిలో ఉన్నపుడు మాఘమాసము అన్నారు. 12) మీనరాసిలో ఉన్నపుడు ఫాల్గుణ మాసము అన్నారు.

కాలచక్రములోని పండ్రెండు భాగములలో ఆరు భాగములను ఉత్తరాయణముగ, మిగత ఆరు భాగములను దక్షిణాయణముగ లెక్కించడము జరుగుచున్నది. సూర్యుడు మకరరాసిలో ప్రవేశించిన పుష్యమాసము నుండి మిథునరాసిలో ఉండు జ్యేష్టమాసము వరకు ఆరు నెలల కాలమును ఉత్తరాయణమనియు, అలాగే సూర్యుడు కటకరాసిలో ప్రవేశించిన ఆషాఢ మాసము నుండి ధనస్సురాసిలో ఉండు మార్గశీర్ష మాసము వరకు ఆరునెలల కాలమును దక్షిణాయణమనియు చెప్పడము జరుగుచున్నది. కాలచక్రములో మొదటిదయిన మేషరాసిని ఒకటవ దానిగ తీసుకుంటే చివరిదైన మీనము




కర్మచక్రము

పంౖడెండవదగును. జ్యోతిష్యశాస్త్రము ప్రకారము ఒకటవ రాసి మానవుని జన్మరాసి అగును, అలాగే పంౖడెండవది మరణరాసి అగును. మనిషి పుట్టుక, శరీర లభ్యము యొక్క విషయములు ఒకటవ స్థానములో ఉండగ, చివరి మరణము గురించిన విషయమంతయు పంౖడెండవ స్థానములో ఉండును. మనిషి పుట్టుక మరియు మరణముల విషయములు ఉత్తరాయణ భాగములోనే కలవు. ఉత్తరాయణ భాగము జ్ఞానసంబంధమైనదనీ, దక్షిణాయణ భాగము అజ్ఞాన సంబంధమైనదని కూడ చెప్పబడినది. ఉత్తరాయణ కాలములో చనిపోయినా, పుట్టినా మోక్షము పొంది దేవునిలో

ఐక్యమగుటకు అవకాశమున్నది. అంతేగాక ఉత్తరాయణ కాలములో పుట్టినవారు దైవసంబంధ జ్ఞానముపొంది జ్ఞానిగా జన్మించుటకు కూడ అవకాశమున్నది. సూర్యుడు ఉత్తరాయణములో ప్రవేశించి ఉండు ఆరునెలల కాలము దైవవరముగ ప్రాముఖ్యతచెంది ఉండుటవలన ఆ కాలమును ఉత్తరాయణ ఉత్తమకాలమని పూర్వము అనెడివారు. కాలక్రమమున ఉత్తరాయణ ఉత్తమకాలము మార్పుచెంది ఉత్తరాయణ పుణ్యకాలమని పలుకబడుచున్నది.

మేషము, వృషభము, మిథునము ఈ మూడు రాసుల కాలమును, అలాగే మకర, కుంభ, మీనరాశులయందు మూడు నెలల కాలమును ఉత్తరాయణమని చెప్పుకొన్నాము. మిగత ఆరునెలల కాలము దక్షిణాయణ ముగ లెక్కించుకొనుచున్నాము. ఉత్తరాయణము ఉత్తమమైనదిగా దైవ వరముగా లెక్కించుకోగా, దక్షిణాయణము ప్రపంచవరమైన భోగములకు ప్రతీకగ చెప్పుకొనుచున్నాము. దక్షిణాయణము ప్రకృతి భోగములకు గుర్తుగ ఉన్నది. ప్రపంచములోని అనుభవములను భోగములనుచున్నాము. ప్రపంచ సంబంధవిషయములను అనుభవించుటను భోగము అనుచుండగా! దైవ సంబంధ ఆత్మను అనుభవించుటను యోగము అంటున్నాము. భోగములో కర్మలు అనుభవింపబడుచున్నవి. యోగములో కర్మలు కాల్చబడుచున్నవి. దక్షిణాయణమును భోగములకు గుర్తుగ చెప్పుకొన్నారు. భోగములు అజ్ఞానమునకు సంబంధించినవి, కావున దక్షిణాయణమును ప్రపంచ సంబంధ భోగముల చిహ్నముగ వ్యక్తపరిచారు. ఉత్తరాయణమును దైవసంబంధ యోగములకు గుర్తుగ చెప్పుకొన్నారు. ఈ విధముగ చెప్పడమే కాక అందరికి కొంత గుర్తుండునట్లు కూడ చేశారు. ప్రతి మనిషికీ భోగములను అనుభవించడము అలవాటై పోయినది. భోగములనగా కేవలము సుఖములే అనుకోకూడదు. కష్టములను సుఖములను రెండిటిని భోగములే అంటున్నారు. భోగములనగా అనుభవించునవని అర్థము.

అలాగే ప్రతి మనిషి యోగములను పొందలేకపోవుచున్నాడు. యోగములనగా భోగములకు వ్యతిరేఖములుగ ఉన్నవి. కర్మానుభవము కానివి యోగములు, కర్మను కాల్చునవి యోగములు, జ్ఞానమను అగ్ని నిలయములు యోగములు. కర్మలను కాల్చునది జ్ఞానాగ్ని మాత్రమే నని మరువకూడదు. జ్ఞానాగ్ని నిలయమైన యోగములకు గుర్తుగ ఉత్తరాయణము, అనుభవములకు నిలయములైన భోగములకు గుర్తుగ దక్షిణాయణము జ్ఞాపకముండునట్లు సంవత్సరములో ఒక పండుగను ఉంచారు. అదియే సంక్రాంతిపండుగ, దీనినే మకరసంక్రాంతి అందురు.

మకర రాసిలోనికి సూర్యుడు ప్రవేశించుటను మకర సంక్రాంతి అంటున్నాము. సాధారణముగ జనవరి 14వ తేదిననే సంక్రాంతి వచ్చుచుండును. బహుశ కొన్ని సంవత్సరములకొకమారు జనవరి 15వ తేదీన సంక్రాంతి జరుగుచుండును. జనవరి 13 తేది వరకు దక్షిణాయణ ముండగా, 14వ తేది నుండి ఉత్తరాయణమగును. దక్షిణాయణము భోగములకు గుర్తు కావున ఆ విషయము గుర్తుండునట్లు జనవరి 13వ తేదీని సంక్రాంతి ముందు రోజును భోగి అన్నారు. భోగి తర్వాత సంక్రాంతి అనుట సహజముగ ఉన్నదే. భోగి దినమున రాత్రికి మంటలు వేసి భోగి మంటలని పేరు పెట్టడము కూడ జరిగినది. భోగిని గుర్తింపుగ చెప్పు కోవడమూ ఆ రాత్రికి మంటలు వేయడమూ అందరూ చేస్తున్న పనియే కాని దాని అర్థము, వివరము చాలామందికి తెలియదనుకొంటాము.

దక్షిణాయణము అజ్ఞాన సంబంధ, ప్రపంచ సంబంధ గుర్తు అని ముందే చెప్పుకొన్నాము. ప్రపంచ అనుభవములకు తార్కాణముగ ఉన్న దక్షిణాయణమును **భోగి** అను పేరుతో చివరిదినమున గుర్తు చేసుకొనుచు, మా జీవితములలో కూడ నేటి నుండి భోగములు పోయి యోగములు రావాలని పూర్వము కోరుకొనెడివారు. భోగములు అనగ అనుభవములకు

కారణమయిన కర్మపోవాలని, భగవద్గీతలో చెప్పినట్లు కర్మలను కట్టెలుగ, జ్ఞానమును అగ్నిగ పోల్చి ఆ రాత్రికి మంటలు వేసెడివారు. అనుభవమునకు రాబోవు కర్మలను లేకుండ చేయడమునకు చిహ్నమే భోగి మంటలు. దక్షిణాయణము చివరిలో భోగములకు స్వస్తిచెప్పడము, భోగిమంటలు మండించడము, అలాగే ఉత్తరాయణము మొదటిలో యోగమునకు ఆహ్వానము పలుకడము సంతోషకరమైన విషయము. కావున ఆ దినమును సంక్రాంతి ఉత్సవముగ పండుగ చేసుకొనుట పూర్వాచారము. పూర్వము పెద్దలు భావయుక్తముగ చేసిన ఆచారము నేటికిని జరుగుచున్నప్పటికీ భోగి అని ఎందుకు అంటున్నామో, భోగిమంటలు ఎందుకు వేస్తున్నామో, సంక్రాంతి పండుగ ఎందుకు చేస్తున్నామో తెలియదు.

**"జ్ఞానాగ్ని సర్వకర్మాణాం భస్మసాత్"** జ్ఞానమను అగ్నిచేత సర్వకర్మలు భస్మీపటలమగునని గీతయందు భగవంతుడు చెప్పాడు. భోగికున్న కర్మలను జ్ఞానమను అగ్ని కాల్చడమునే భోగి మంటలు అంటున్నాము. సంక్రాంతికంటే ముందు దినము అజ్ఞానమునకు చివరిదినము కావలెననీ, సంక్రాంతి మొదటి దినము జ్ఞానమునకు ఆరంభ దినము కావలెననీ, అంతరార్థమును బాహ్యార్థముగ తెల్పుచు పూర్వము భోగి మంటలు వేయగ ఆనాటి ఆచారము ఈనాటికి ఉన్నది. ఆచారముంది అర్థము లేదు. ఈనాటి ఆచారమునకు ఆనాటి అర్థమును జోడించుకొని భోగిమంటలు వేయడము చేస్తే ఎంతో విలువతో కూడుకొన్న పని అగును. కావున ఈరోజు ఉద్ధేశ్యముతో పనిచేస్తే ఒకనాటికది నెరవేరును. ఉద్ధ్యేశము లేని పని వ్యర్థము, కావున బజారులో భోగిమంటలు మండించితే ప్రయోజనము లేదు. మన తలలో భోగములకు కారణమైన కర్మలను జ్ఞానమంటలతో మండించవలెను. ఇప్పటికైన విలువ అర్థము తెలిసి భోగిపండుగ చేస్తాము. శరీరములో జ్ఞానమను అగ్నిని చేకూర్చుకొని కర్మలను కాల్చగలమను అర్థముతో బయట భోగి మంటలను మండిస్తాము.

# సంక్రాంతి

'సం(క్రాంతి' అను పదములో రెండు భాగముల అర్థము కలదు. "సం" అనగా మంచి అని చాలామార్లు చెప్పుకొన్నాము. "సం"సారము అనగా మంచి సారముగలదనియు, "సం" బంధము అనగా మంచి బంధమనియు, "సం" గీతము అనగా మంచి పాట అనియు తెలుసు కొన్నాము. దాని(ప్రకారమే ఇపుడు సం(క్రాంతి అనగా మంచి (క్రాంతి అని చెప్పవచ్చును. (క్రాంతి అనగా తిరుగుబాటు అని అర్థము. (క్రాంతివీరులు అనగా తిరుగుబాటు వీరులని అర్థము. ఆ పద్ధతి (ప్రకారము సం(క్రాంతి అనగా మంచి తిరుగుబాటు అనియు లేక మంచి పోరాటమనియు చెప్పవచ్చును. సం(క్రాంతి ఒక గొప్ప పండుగకాగా మీరేమో మంచి పోరాటము, ఉత్తమ తిరుగుబాటు అంటున్నారేమిటి? అని కొందరు మమ్ములనడుగవచ్చును. దానికి మా సమాధానమేమనగా! దాని అర్థమూ, అమలు జరుగుటా అన్నియు వాస్తవమే. సం(క్రాంతిలో మంచి తిరుగుబాటు ఉండుట సత్యమైన విషయమే. అట్లని ఈ తిరుగుబాటు బయట ఎవరిమీద చేయునది కాదు, కొంతమందితో కలిసి చేయునదీకాదు. బయట తిరుగుబాటు మంచిదీకావచ్చును లేక చెడుదీ కావచ్చును. అట్లుకాక ఎప్పటికీ మంచి తిరుగుబాటైనది సం(క్రాంతియే! సం(క్రాంతి వ్యక్తిగత తిరుగుబాటు, కానీ సామూహిక తిరుగుబాటు కాదంటున్నాము. సం(క్రాంతికంటే ముందు భోగిమంటలను చూపినవాడు దక్షిణాయణము చివరిలో వాంఛలన్నిటినీ లేకుండ చేస్తున్నానను ఉద్ధేశ్యమును బయటికి (ప్రకటించిన తర్వాత ఉత్తరాయణము (ప్రారంభములో నేను భోగిగా కాకుండ ఇప్పటినుండి యోగిగా ఉంటానని ఆ దినము సం(క్రాంతిని (ప్రకటించు చున్నాడు. శరీరములోగల అహము మీదగానీ, మనస్సుమీదగానీ జీవుడు తిరుగుబాటును (ప్రకటించడమును మంచి తిరుగుబాటని సం(క్రాంతి అనుచున్నాము. **మనస్సు మీద తిరగబడితే (బ్రహ్మయోగిగా, అహము**

**మీద తిరుగబడితే కర్మయోగిగా మనిషి మారగలడు.** ఇది వ్యక్తిగత తిరుగుబాటనియూ, వారివారి శరీరములో జీవుడు ఒక్కడే చేయు తిరుగుబాటనియూ ముందే చెప్పుకొన్నాము కదా! జీవుడు తన శరీరములో అంతవరకు మనస్సు చెప్పినట్లు, అహము చెప్పినట్లు వినెడివాడు. ఆ విధముగా వినడము వలన ప్రతి ఒక్కరూ అజ్ఞానస్థితిలో ఉన్నట్లేయగును. అంతేకాక అటువంటివాడు యోగికాడనీ, అతను భోగి మాత్రమే అగునని పెద్దలు తెలియబరిచారు. అంతవరకు మనస్సు, అహము మాటలు వింటూయున్నవాడు ఒక్కసారిగా వినకుండపోవడము మనో,అహముల మీద తిరుగుబాటు చేసినట్లు కాదా? మనస్సు, అహములు రెండూ వాటిమాటను వినునట్లు చేసుకోవాలని ఎంతో బలమైన ప్రయత్నము చేసినా, జీవుడు వినకుండ పోవడము వాటిమీద పోరాటము చేసినట్లు కాదా?

అహముమీద కానీ, మనస్సుమీద కానీ వ్యతిరేఖముగా ఉండడమూ, వాటి మాట వినకుండపోవడమూ చాలా గొప్ప పని మరియు చాలా మంచిపని. అందువలన దానికి **"సంక్రాంతి"** అను పేరునుంచారు. చూచారా! సంక్రాంతి పేరులోనే ఎంత అర్థముందో!! **భగవద్గీతా శాస్త్రములో సారాంశమంతయు యోగిగా మారమనిగలదు.** యోగిని రెండు విధములుగా విభజించి కర్మయోగి, బ్రహ్మయోగి అని గీతలోనే తెలియ జేశారు. దేవుని ధర్మములను ఆచరించితే ఎవడైన యోగికాగలడు. దేవుని ధర్మములేవో తెలియకపోతే, ప్రకృతిధర్మములైన మనస్సుమాట, అహము మాట విని ఆచరించితే ఎవడైనా భోగి కాగలడు. భోగి పండుగ రోజు భోగములను వదలునట్లు భోగిమంటలు వేయుట, సంక్రాంతి పండుగరోజు యోగమును ఆచరించునట్లు కొద్దిసేపైనా యోగసాధనలో కూర్చొనుట, భోగి సంక్రాంతి పండుగల రోజు చేయవలసిన ముఖ్యమైన ఆచరణ. పూర్వము భోగి, సంక్రాంతిని **"జోడు"** పండుగలుగా ఆచరించెడి వారు.

ఈ రెండు పండుగలను ఆధ్యాత్మిక అర్థముతో జ్ఞానులు ఏర్పరచారు. కావున అందరూ అర్థమును తెలిసి ఆచరించెడివారు. **కర్మ అనుభవములకు భోగి గుర్తుగా, కర్మ నాశనమైన యోగమునకు గుర్తుగా సంక్రాంతి ప్రతి సంవత్సరము ప్రజలు చేసెడివారు.** భోగములను వదలుకొమ్మని, యోగములను అలవరచుకొమ్మని ఆనాటి స్వామీజీలు, మహర్షులు, బోధకులు చెప్పెడివారు. కుటుంబములో క్రొత్తగా పుట్టిన పిల్లలకు కొంత వయస్సు వస్తూనే భోగి, సంక్రాంతి పండుగల వివరమును తెలిపి వారిని సక్రమ మార్గములో నడిచేటట్లు చేసెడివారు. ఈ విధముగ ఈ పండుగల వలన ప్రజలు కొంత జ్ఞానము తెలిసి బ్రతికెడివారు. ఎవరిలోనైన అజ్ఞానము పెరుగుటకు మొదలిడినా పండుగ సమయములో అర్థసహితముగా నడుచుకొనుట వలన వారిలోనున్న ఆ కొంత అజ్ఞానము పోయెడిది. అందువలన అందరూ శాంతిగా జ్ఞానయుతముగా బ్రతికేవారు.

ఈనాడు జోడుపండుగలైన భోగి,సంక్రాంతి రెండు పండుగలు ఉన్ననూ, పూర్వకాలమున్న అర్థమూ ఆచరణలు నేడు కరువైపోయినవి. భోగి అంటే గానీ, సంక్రాంతి అంటేగాని అర్థము తెలియని హిందూ సమాజము తయారైనది. ఇది సామాన్యమనిషికే కాక హిందూమతములో మేము పెద్దలము అనుకొన్నవారికి కూడ సంక్రాంతి అర్థము తెలియదు. నేడు అర్థము తెలియకపోయినా, ఆచరణ కొంతైనా మన మధ్యలో మిగిలియున్నది. భోగి దినము రాత్రికి భోగిమంటలు వేయువారు కొన్ని ప్రాంతములలో గలరు. భోగిమంటల ఆచరణ అయితే చేయుచున్నారు, కానీ మంటల ముందర పూర్వపు భావము ఎవరివద్ద లేకుండ మత్తుపానీయములు త్రాగి చిందులు వేయుచున్నారు. భోగములు వదులుకోవలసిన ఆ సమయములో సరదాగా త్రాగుచు, తినుచు కాలము గడుపుచున్నారు. మరుసటి దినమైన సంక్రాంతిరోజు ఆ పేరుకు తగినట్లు

ఒక్క నిమిషము కూడ మనస్సును నిలుపువారుగానీ, అహమును అణచివేయువారుగానీ కనపడడములేదు. సంక్రాంతి అంటే ఆడవారి ముగ్గులపండుగగ తలచి ప్రతి ఇంటి ముందర ముగ్గులువేయుచున్నారు. సంక్రాంతి దినము కూడ మనో, అహముల మీద ఏమాత్రము **"క్రాంతి"** లేకుండ రంగుముగ్గులువేసి, రంగుగుడ్డలు ధరించి వినోదములలోనే గడుపుచున్నారు. ఇదంతయు చూస్తే, పూర్వము పెద్దలు పెట్టిన భావము కొంతైనా లేకుండా పోయినదని తెలియుచున్నది. ఇపుడు మేము తెల్పిన ఈ విధానమంతయు చదివినవారు కొంతకు కొంతైనా మారగలరని తలచుచున్నాము. ఇదంతయు చదివిన తర్వాత మీరు మారకపోయినా పరవాలేదు, కానీ మమ్ములను విమర్శించి, దూషించి మేమే నిజమైన హిందువులము, నీవు పరమతస్థునివి, పరమత బోధ చేస్తున్నావు అని మాత్రము అనవద్దండి. మేము చెప్పునది ఆధ్యాత్మిక అర్థముతో కూడుకొనియుండును. కొందరికి సులభముగా అర్థముకాకపోవచ్చును. అంతమాత్రమున మమ్ములను దూషించవద్దండి.



# దశరా

దశరా అను పదము మొదట "దశర" అను పదముగా ఉండెడిది. ప్రస్తుతకాలములో దశకు ప్రక్కన దీర్ఘము **"రా"** ఉన్నది. పూర్వకాలములో దశకు ప్రక్కన దీర్ఘము కల్గిన **"రా"** కాకుండ కేవలము దీర్ఘములేని **"ర"** మాత్రముండెడిది. అందువలన పూర్వమున్న **"దశర"** అను పదము ఇప్పుడు **"దశరా"** అని పలుకబడుచున్నదని తెలియవలెను. నేడు గల పండుగలన్నియు పూర్వము బ్రహ్మజ్ఞానులు ఉద్దేశ్యపూర్వకముగా పెట్టినవేనని తెలుసుకొన్నాము. అందువలన అవి అన్నియూ ఆధ్యాత్మిక అర్థముతోనే

కూడుకొని ఉండును. ఇపుడు మనము కూడ వారు నిర్ణయించిన అర్థముతోనే వివరించుకోవలసియున్నది. పూర్వము "దశర" అను పేరు కొంత కాలమునకు "దశరా"గా మారిపోయినది. తర్వాత కొంత కాలమునకు ఆధ్యాత్మికత తెలియకుండ పోయి కొన్ని పురాణముల కల్పనచేత "విజయదశమి" అయినది. ఈ విధముగా దశర విజయదశమి అయినది. అలా మారిపోవడము చేత పెద్దలు నిర్ణయించిన దశర భావమునకు విజయదశమి అర్థము పూర్తి వ్యతిరేఖమై పోయినది. పూర్వము దశర అను పదమునకు ఆధ్యాత్మిక అర్థము ఒకటే ఉండెడిది. తర్వాత దశరాకు కూడ దాదాపు అదే అర్థముండెడిది. కానీ విజయదశమి అను పేరుకు పూర్తి భావము మారిపోయినది.

'శత' అనగా నూరు అనియూ, 'దశ' అనగా పది అనియు అందరికీ తెలుసు. ఇక్కడ దశరలో "ర" అనగ నాశనము అని అర్థము గలదు. మంత్ర ఉచ్చాటనలో కూడ "రం" అను అక్షరమును నాశనమునకు బదులు బీజాక్షరముగా వాడుదురు. "హర" అను పదము యొక్క అర్థము నాశనము చేయువాడని అర్థము. అందులో 'ర' అనగా నాశనము అనియు, 'హ' అనగా చేయువాడనియు హర అనగా నాశనము కల్గించువాడు అని కూడ చెప్పవచ్చును. 'రి' అనగా పాలన అనియు, 'హరి' అనగా పాలన చేయువాడని అర్థము గలదు. ఇక్కడ ఒక 'ర' విషయానికి వస్తే దానియొక్క అర్థము ప్రకారము లేకుండ చేయడము, కృశించునట్లు చేయడము, నాశనము చేయడమని చెప్పవచ్చును. దశరలో 'ర' కు అనుసంధానముగ దశ అనియున్నది. దశ అనగ పది అని అర్థము కదా! దాని ప్రకారము పదింటిని నాశనము చేయునది దశర అని అర్థమగుచున్నది. అర్థమంతా బాగానే ఉన్నది కానీ పది ఏమిటి? నాశనమేమిటి? అను ప్రశ్న ఎవరికైనా రాగలదు. ఆ ప్రశ్నకు జవాబు ఏమనగా! మనము పండుగలకన్నిటికి

ఆధ్యాత్మిక జవాబునే వెదకవలెనని చెప్పుకొన్నాము కదా! దానిప్రకారము వివరించుకోవలసియున్నది. ఇక్కడ ఇంకా కొందరికి ఆధ్యాత్మికము అంటే ఏమిటి? అను ప్రశ్న కూడ ఉండవచ్చును. దానికి కూడ కొద్దిగ వివరము చెప్పుకొందాము. ఆత్మను గురించి తెలుసుకోవడమును ఆధ్యాత్మికము అనవచ్చును. ఇంకా వివరముగా చెప్పుకుంటే ఆత్మను గురించి అధ్యయనము చేయడమును ఆధ్యాత్మికము అంటాము. ఆత్మ అనునది శరీరములోపలే జీవాత్మతోపాటు నివసిస్తున్నది. కావున శరీరములోనే ఆధ్యాత్మికము గలదు. దొంగలుంటే పోలీసులుంటారు. అలాగే పోలీసులుంటే దొంగలున్నారని తెలిసినట్లు, ఆత్మయుంటే జీవాత్మ యుంటుంది, జీవాత్మ యుంటే ఆత్మయుంటుంది. ఏ విధముగా పోలీసులకు దొంగలకు అవినాభావ సంబంధముందో, అదే విధముగా ఆత్మకు జీవాత్మకు సంబంధమున్నది. అందువలన ఆత్మను జీవాత్మను జోడు ఆత్మలని అంటున్నాము. జోడు ఆత్మలున్న శరీరమునకు బయట పది శరీర భాగములుగలవు. వాటినే దశేంద్రియములు అంటున్నాము. వాటిని వివరించుకొని చూస్తే ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములని విభజించుకొని చెప్పవచ్చును. కర్మేంద్రియములు ఐదు వరుసగా 1) కాళ్ళు 2) చేతులు 3) నోరు 4) గుదము 5) గుహ్యము అని చెప్పవచ్చును. అలాగే జ్ఞానేంద్రియములు ఐదు వరుసగా 1) కన్ను 2) చెవి 3) ముక్కు 4) నాలుక 5) చర్మము అని చెప్పవచ్చును. కర్మ, జ్ఞానేంద్రియములు మొత్తము పది కదా! ఈ పదింటినే “ర” చేయమన్నాడు, అంటే నాశనము చేయమని చెప్పడమునే “దశర” అని చెప్పవచ్చును. ఇపుడు వెంటనే ఒక ప్రశ్న ఎవరికైనా రావచ్చును. అదేమనగా! పదింటిని నాశనము చేయమంటే కన్నును పొడిచేయాలా? చెవును కోసేయాలా? నాలుకను కోసేయాలా? ముక్కును నరికేయాలా? చర్మమును పెరికేయాలా? అలాగే కాళ్ళు, చేతులను తీసివేయాలా? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా!

కన్ను మొదలగు జ్ఞానేంద్రియములను గానీ, కాలు మొదలగు కర్మేంద్రియములనుగానీ పొడిచేయమనీ, నరికేయమనీ ఎవరూ చెప్పలేదు. వాటిని లేకుండా చేయమంటే వాటి పనిని లేకుండ చేయమని అర్థము. వాటి పనిని లేకుండ చేస్తే అవి ఉన్నాలేనట్లే అగును. దీనిని గురించి చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. ఒక ఇంటిలో విద్యుత్తు బల్బులు చిన్నవి, పెద్దవి మొత్తము పది ఉన్నాయనుకొనుము. అవి పగటి పూట వెలగవలసిన పనిలేదు, రాత్రిపూట పది బల్బులు వెలుగుచుండును. అది అందరి ఇళ్లలోను సహజముగా ఉండు విధానము. కానీ ఒక ఇంటి యజమానికి రాత్రిపూట కూడ వెలుతురుతో అవసరములేదు. అపుడు అతను బల్బుల పనిని లేకుండ చేస్తాడా? బల్బులనూ, వైర్లనూ పెరికి లేకుండ చేస్తాడా? పెరకకుండానే వాటి పనిని లేకుండ చేసి వెలుతురును లేకుండ చేయును. ఇల్లంతా చీకటై, వెలుతురు ఏమాత్రము ఉండకూడదనుకుంటే పది బల్బులను ఆర్పివేసి వాటి పనిని లేకుండ చేయును. ఇది ఒక విధానము కాగా, రెండవ విధానము కూడా మరియొకటి కలదు. అది ఏమనగా! ఇంటిలోని బల్బులన్నీ వెలుగుచున్ననూ, తాను కళ్ళను గట్టిగా మూసుకొంటే వెలుతురు ఏమాత్రము కనిపించదు కదా! ఈ విధముగా కూడ వెలుతురు తనకు తెలియనట్లు చేసుకోవచ్చును. ఇక్కడ ఒక విధానము ప్రకారము వెలుతురు లేకుండ చేసుకొనుటకు బల్బుల పనిని లేకుండ చేస్తున్నాము, కానీ బల్బులను లేకుండా చేయడము లేదు. అలాగే మరియొక విధానములో బల్బుల పని చేయుచున్నా తానే స్వయముగా చూడకుండా, వెలుతురును లేకుండ చేసుకొనుచున్నాడు. కానీ అప్పుడు కూడ బల్బులను పెరికి వేయడముగానీ, పగులగొట్టడముగానీ చేయలేదు కదా! ఇక్కడ కొందరొక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా! వెలుగును లేకుండ చేసుకొనుటకు మరియొక విధానముగా బల్బులన్నిటిని పగులగొట్టవచ్చును కదా! అట్లు

కూడ వెలుతురు లేకుండ పోవును కదా! అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! ఇంటి యజమాని రాత్రిపూట ఏమి చేయక ఊరకుండవలయుననుకొన్నపుడు, వెలుతురుతో పనిలేనపుడు ఒక విధముగ బల్బులను పని చేయకుండ ఆర్పివేయవచ్చును. మరొక విధముగా కన్నులను మూసుకోవచ్చును అని అనుకొన్నాము కదా! బల్బులను మాత్రము పగులగొట్టదని కూడ చెప్పుకొన్నాము. ఎందుకలా పగులగొట్ట లేదనగా! రాత్రిపూట వెలుగు అవసరము లేదనుకొన్న యజమాని అప్పుడప్పుడు రాత్రిపూట కూడ పని చేయవలసి వస్తున్నది. అలాంటి సమయములో వెలుతురు అవసరము. వెలుగు అవసరమైనపుడు వెలిగే పరికరములైన బల్బులు తప్పనిసరిగ ఉండవలయును కదా! అందువలన కరెంటు తీగలను, బల్బులను పెరికి వేయలేదు, పగులగొట్టలేదని తెలియవలెను.

అదే విధముగనే శరీరమను ఇంటిలో పని చేయు బయటి అవయవములు పది గలవు. కరెంటు బల్బులకు పగటి పూట పనిలేనట్లు పది అవయవములకు కూడ రాత్రిపూట పనిలేదు. రాత్రిపూట బల్బులకు పని ఉన్నట్లు, పగటిపూట మాత్రము పది అవయవములకు పని గలదు. శరీరములోనున్న జీవునికి పది అవయవముల పని అవసరములేదు అనుకుంటే ఒక విధానము ప్రకారము ఇంటిలో లైట్ల పనిని నిలిపినట్లు అవయవముల పనిని ఆపివేయవచ్చును. రెండవ విధానము ప్రకారము వెలుతురును వద్దనుకొన్నవాడు కళ్ళను మూసుకొన్నట్లు, పది అవయవములు పని చేయుచున్ననూ జీవుడు అవయవముల పనియొక్క ఫలితము మీద ధ్యాసలేకుండ ఉండవలెను. పది బల్బులు వెలుగుచున్ననూ కళ్ళను మూసుకొన్న వానికి బల్బుల వెలుతురు తెలియనట్లు, పది అవయవములు పని చేయుచున్ననూ వాటి మీద ధ్యాసలేనివానికి అవయవముల పని

యొక్క ఫలితకర్మ జీవునికి అంటదు.  ఈ విధముగా రెండు పద్ధతుల ప్రకారము జీవుడు పది అవయవముల అవసరము లేకుండ చేసుకోవచ్చును. అంతేకాని పది అవయవములను పొడిచివేయడమూ, నరకివేయడమూ అవసరములేదు.  అవసరమైనపుడు అప్పుడప్పుడు శరీర అవయవములతో జీవుడు పని చేయవలసి వస్తుంది.  కావున అవయవములు శరీరమునకు ఉండవలసిందే.

ఒక విధానము ప్రకారము పది అవయవముల పనిని ఆపి వేయడమును బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలో **బ్రహ్మయోగము** అని అన్నారు.  రెండవ విధానము ప్రకారము పది అవయవములు పని చేయుచుండగ జీవుడు వాటి సంబంధములేకుండ ఫలితము మీద ధ్యాస లేకుండ ఉండడమును భగవద్గీతలోనే **కర్మయోగము** అన్నారు.  ఈ రెండు యోగములలో పది అవయవముల సంబంధమును తెంచుకోవడము రెండు పద్ధతులుగానే ఉన్నది.  అందువలన పదింటి ఫలితమును లేకుండ చేసుకొమ్మని తెలుపు యోగ సారాంశమును **"దశర"** అను పండుగ రూపములో పెద్దలు పెట్టారు.  దశర అనగా పదింటిని లేకుండ చేసుకొమ్మనియేగా అర్థము.  పూర్వము ఈ విధముగా అర్థమును తెలిపి పండుగనుంచారు.  కాలక్రమేపి అజ్ఞానము పెరిగిపోయి ధర్మములు అధర్మములుగా మారిపోయినవి. అందువలన నేడు "దశర"కు అర్థము తెలియకుండ పోయినది.  బ్రహ్మ, కర్మయోగములకు ప్రతీకగా దశర ఉన్నదనియూ, పెద్దలు దశరా అను పేరు పెట్టడములోని అంతరార్థము యోగముల సూచనయేననియూ, ఇప్పటి కాలములో ఎవరికి తెలియకుండ పోయినది.  ఒకవేళ **'ర'** కు అర్థము తెలియకపోయినా **దశ** అనే దానికి పది అను అర్థము అందరికి తెలుసు కదా! అటులైనా దశరా అంటే పదిరా అని అర్థమౌతుంది కదా!! అపుడైనా పది అంటే ఏమిటి అని యోచించ వచ్చును కదా!!!

దశరా అంటే పదిని గురించిన సమాచారము ఏదో ఉందని ఎవరూ అనుకోవడము లేదు. దశరా అంటూనే కొందరు ఉద్యోగస్తులు దశరా మామూలు పేరుతో డబ్బు వసూలు చేయవచ్చని సంబరపడి పోవుచుందురు. ఈ పండుగ వస్తే దశరా మామూళ్ళని చాలామంది డబ్బులు అడుగుతారనీ, అడిగినవారికి ఇవ్వకపోతే బాగుండదనీ, ఇవ్వాలనుకుంటే తమవద్ద డబ్బులు లేవనీ తప్పనిసరిగ వడ్డిచెల్లించి బాకీచేసి మర్యాదకోసము మామూళ్ళు ఇచ్చువారు కొందరు గలరు. దశరా వస్తే మామూళ్ళ రూపములో వచ్చిన డబ్బుతో కొందరు పాతబాకీలను తీర్చుకోవడము చేస్తుంటే, కొందరు మామూళ్ళరూపములో ఇతరులకు డబ్బు ఇచ్చిన దానివలన క్రొత్త బాకీలపాలగుచున్నారు. పూర్వము పెద్దలు దశరా పండుగ మంచి జ్ఞాన సందేశమును ప్రజలకు ఇస్తుందనుకొంటే, అలాకాకుండ దశరా పండుగ ప్రజలలో మామూళ్ళను, దురభ్యాసమును నేర్పినట్లున్నది. ఎల్లపుడు హిందూసంస్కృతిని రక్షించాలని పరమతస్థుల మీద విరుచుకుపడుచున్న హిందూసంస్థలు తమ మతములో పండుగల సంస్కృతి మంటగలిసి పోతున్నదని గ్రహించలేకున్నారు. ఈ మామూళ్ళు మంచిదికాదని చెప్పలేకున్నారు. హిందూమతములో ఏ స్వామిజీ కూడ మామూళ్ళ దురభ్యాసమును ప్రత్యక్షముగాగానీ, పరోక్షముగా గానీ ఖండించడము లేదు. ఎవరూ ఖండించక పోయినా మేము కొన్ని సంవత్సరములుగా ఈ విష సంస్కృతిని ఖండిస్తూనే ఉన్నాము. హిందూ సంస్కృతి బాగుపడాలని మేము చేయు ప్రయత్నమును, మేము చెప్పు బోధలను చూచిన ప్రజలు జ్ఞానమంటే ఇదీ అని సంతోషపడుచుండగా, హిందూమతములో మేము ముఖ్యమైన వారమని పదవులవలె కొన్ని పేర్లు పెట్టుకొన్న కొందరు మమ్ములను చూచి ఓర్వలేక మేము హిందువులమే కానట్లు, పరమతములను గురించి బోధిస్తున్నట్లు ప్రచారము చేయుచున్నారు. అటువంటివారు ఏమి ప్రచారము చేసినా మేము ఎవరైనది, ఏమి చేయుచున్నది ప్రజలకు కనిపిస్తున్నది కదా!

పూర్వమున్న దశర అనుపేరు కాలక్రమమున పలుకడములో దశరాగా మారపోయినదని తెలుసుకొన్నాము. అంతేకాక దశరా అనుపేరు “విజయదశమి”గా కూడ పిలువబడుచున్నది. పూర్వము జ్ఞానులు పెట్టిన దశర అను పేరులో పది నాశనమగుట అను అర్థమిమిడివుంటే, నేడు గల విజయదశమి యొక్క పేరులో పది విజయము పొందినవి అను అర్థము గలదు. **దశ అనినా, దశమి అనినా, పదియనియే అర్థము వచ్చును.** కానీ ‘ర’ అనగా నాశనమని అర్థముండగ, విజయ అంటే గొప్ప జయము, గొప్ప గెలుపు అని అందరికి తెలిసినదే. యుద్ధములో ఒకడు నాశనమైతే మరొకడు విజయమును పొందుతాడు. **పూర్వమేమో పది నాశనము అయిన దినము దశర అని పెద్దలు చెప్పితే, ఇపుడేమో పది విజయము పొందిన దినము విజయదశమి అంటున్నారు.** ఏది సరియైనదో మీరే యోచించండి. కొందరేమో ఆధ్యాత్మికత లేని పురాణమును సృష్ఠించి దుర్గాదేవి విజయము పొందిన దినమని, నవరాత్రుల పూజలు దుర్గాదేవికి చేస్తూ చివరి పదవదినము దేవి విజయము పొందిన దినమని చెప్పుచున్నారు. మహిషాసురుడను రాక్షసున్ని తొమ్మిదిమార్లు చంపగా వాడు బ్రతికాడనీ చివరిగా పదవసారి దుర్గాదేవి పూర్తి బ్రతకకుండ చంపివేసినదని, అందువలన దానిని విజయదశమి అంటున్నామని కొందరు అంటున్నారు. దేవతలు ఇచ్చిన పది రకముల ఆయుధములతో మహిషాసురున్ని చంపినది కాబట్టి విజయదశమని అంటున్నామని కొందరు చెప్పుచున్నారు. ఏది ఏమైన మనిషి బాగుపడే ఆధ్యాత్మికత వారు చెప్పు కథలలో లేదనీ, దాని వలన తన విషయమై మనిషి ఆలోచించక దశరాను దుర్గాదేవి విజయమని అనుకొంటున్నాడు. తనకు పెద్దలు తెలిపిన జ్ఞానసందేశమే దశరా అని అనుకోవడము లేదు.

దశరా పండుగ సమయములో ఆయుధాల పూజచేయడము కూడా ఇప్పటి కాలములో గలదు. కొందరు వారు పనిచేయు పనిముట్లకు పూజ

చేయగ కొందరు రౌడీలు, పార్టీలనాయకులు (ఫ్యాక్షన్ నాయకులు) ఏకంగా మారణాయుధములకే పూజలు చేయుచున్నారు. ఇట్లు ఆయుధాల పూజగా దశరా మారిపోవడము విచిత్రముగా ఉంది. అలా మారణాయుధముల పూజలు చేయడమునకు కూడ కొందరు కొన్ని కథలు అల్లి చూపిస్తున్నారు. ఇలా దశరా పండుగలో ఆధ్యాత్మికత ఏమాత్రము లేకుండపోయి పుక్కిడి పురాణముల ప్రాబల్యము ఏర్పడినది. అందువలన పూర్వము పెద్దలు పెట్టిన ఆధ్యాత్మిక భావము లేకుండపోయి క్రొత్త పోకడలతో రూపముమారిన దశరా పండుగ నేడు మనముందున్నది. పూర్వము బ్రహ్మవిద్యను తెలిసిన జ్ఞానులు, ప్రజలు అజ్ఞానములో పడకూడదను మంచి భావముతో కొన్ని పండుగలను భావయుక్తముగా పెట్టగా, నేడు వారి భావమునకు వ్యతిరేఖముగా పండుగలు తయారైనవి. ఇప్పటినుంచైనా పెద్దలు తెల్పిన జ్ఞానమార్గము ప్రకారము, వారు తెల్పిన అర్థముతోనే దశరా పండుగను చేసుకొందాము. పండుగ వివరము తెలియని వారికి కూడ దాని వివరమంతటిని తెలిపి వారిని కూడ సక్రమముగా ఆచరించునట్లు చేద్దాము.

దశరా పండుగ వర్షకాలముచివరిలో, చలికాలము మొదటిలో వస్తున్నది. శరీరము మీద ఉన్న స్థూలశరీరమనబడు పది అవయవములు ఆ కాలములో అందరికి జ్ఞప్తికి రాగలవు. చలిపెట్టేది పైన పది అవయవములకే కదా! అపుడు పామరునికైనా, పండితునికైనా చలి శరీరమును గుర్తు చేయుచున్నది. అప్పుడు చలి బాధనుండి బయటపడుటకు పది అవయవములను వెచ్చని గుడ్డలతో కప్పిపెట్టి బయటికి కనిపించకుండ చేస్తాము. పది అవయవములను కనిపించకుండ వెచ్చదనమను సుఖము కొరకు చేస్తున్నాము కదా! అలాగే పది అవయవముల పనిని నిరోధించి వాటిని జ్ఞానమను గుడ్డలతో కప్పి, లేనట్లు చేసి మోక్షమను సుఖము కొరకు ప్రయత్నించుమని తెలియజేయుటకే చలికాలము మొదటిలోనే దశరా

పండుగ వస్తున్నది. చలికాలము మొదటిలోనే శరీరమును కప్పుకొనుటకు దుప్పట్లను వెతుకుకొన్నట్లు, శరీర పది అవయముల పనితో సంబంధము లేకుండ జ్ఞానమును వెతుక్కోవలెను. ఈ విధముగ దశరాపండుగ ఉన్నతమైన జ్ఞానమార్గమునకు నాంది పల్కుచున్నది. చలి బాధను లేకుండ చేసుకొనుటకు దుప్పటి ఎట్లు అవసరమో అలాగే కర్మ బాధను లేకుండ చేసుకొనుటకు జ్ఞానమవసరమని దశరా చలికాల ప్రారంభములోనే వస్తున్నది. ఇప్పటి నుండి చలి నివారణకు దుప్పటినుపయోగించినట్లు కర్మనివారణకు జ్ఞానమును వినియోగించుకొందాము.



# శివరాత్రి

ఆధ్యాత్మిక భావములున్న పండుగలలో యుగాది, దశరా, సంక్రాంతితో పాటు శివరాత్రి కూడ ముఖ్యమైన పండుగగా మొదటినుండి చేయబడుచున్నది. యుగాది తర్వాత అన్ని పండుగలకంటే ప్రాచీనమైన పండుగ శివరాత్రియే! భూమిమీద వెలసిన మొట్టమొదటి దేవస్థానము ఈశ్వరుని లింగమున్న గుడియే! ఏ ఇతర ప్రతిమ లేనపుడు మొట్టమొదటి ప్రతిమ శివలింగమే!! ప్రపంచము మొత్తము మీద ఒక్క భారతదేశములోనే మొదటి లింగప్రతిష్ట కృతయుగములోనే జరిగినది. ఈశ్వరలింగము ఎంతో అర్థముతో గొప్ప ఆధ్యాత్మిక భావముతో నిర్మింపబడినది. అప్పటి పెద్దల భావము ఈనాడు మచ్చుకైనా లేదు. లింగమును ఎవరైన పువ్వులు పెట్టి నమస్కరించ వలసిందే, కానీ ఆరాధించకూడదు, అభిషేకము చేయకూడదను నియమము ఆనాడు ఉండెడిది. ఈనాడు ఈశ్వరలింగమునకు అభిషేకములు, ఆరాధనలు నియమమును తెలియక చేయుచున్నారు. ముఖ్యముగా ఈశ్వరలింగము గర్భగుడిలో ఉండకూడదు. పూర్వము పెద్దలు

ఏ ఉద్ధేశ్యముతో శివలింగమును ఉంచారో ఆ ఉద్ధేశ్యము నేడు లేకుండా పోయినది. ఈశ్వరలింగమునకు పైన ధారాపాత్ర తప్ప సింహతలాటము కూడ ఉండకూడదు. లింగమునకు తప్ప ఏ ప్రతిమలకైన గర్భగుడి ఉండవచ్చును. అలాగే లింగమునకు తప్ప ఏ ప్రతిమకైన అభిషేకమూ ఆరాధన ఉండవచ్చును. కానీ నేడు అన్ని ప్రతిమలతోపాటు లింగమునకు కూడ గర్భగుడిని కలుగచేసి అభిషేకములు చేయుచున్నారు. దీనిని బట్టి లింగమునకున్న ప్రత్యేకత ఈ కాలములో తెలియకుండ పోయినది. పూర్వము లింగమును బయలు ప్రాంతములోనే ప్రతిష్ఠించెడివారు. లింగమును గర్భగుడిలో పెట్టుట వలన, అభిషేకములు ఆరాధనలు చేయుట వలన, లింగమునకున్న ఆధ్యాత్మిక భావము పూర్తి మంటకలిసి పోవుచున్నది. ఇటువంటి అజ్ఞానపు పనులు భవిష్యత్తులో ఎవరైనా చేస్తారేమోనని ఊహించిన బ్రహ్మజ్ఞానులు అట్లు చేయనట్లు పూర్వమే శివరాత్రిపండుగను ఉద్దేశపూర్వకముగా పెట్టారు. అయినప్పటికీ శివరాత్రి యొక్క ఉద్దేశ్యము కూడ తెలియనివారు పెద్దల భావమునకు వ్యతిరేఖముగా నడుచుచున్నారు. శివరాత్రి రోజే ఎక్కువగా అభిషేకములు, ఆరాధనలూ చేయడము జరుగుచున్నది. ఈ కాలములో తెలియకుండ పోయిన పూర్వపు పెద్దల ఉద్ధేశ్యమేమిటో తెలుసుకొందాము.

భూమిమీద ఏ దేవాలయములు లేని రోజున మొదటగా పరమాత్మ (దేవుని) ఉనికిని ప్రజలకు తెలియజేయుటకు, దేవుడు రూపములేనివాడని తెలియ జేయుటకు ముక్కు ముఖములేని రాతిని చూపించారు. ఏ ప్రక్కన చూచినా ముఖములేని లింగమును దేవునికి గుర్తుగా ఉంచారు. పూర్వము ఈశ్వర లింగము బయలు ప్రాంతములో ఉండెడిది. పరమాత్మ పుట్టుక లేనివాడు కావున ఆయనకు గర్భమునుండి పుట్టు అవకాశములేదు. అందువలన పరమాత్మ పుట్టువాడు కాదని తెలియజేయుటకు గర్భమను

గుడిలో, అనగా గర్భగుడిలో లింగమునుంచెడివారు కాదు. రూపములేని దేవునికి మనిషి ఆకారమున్న భార్యలేదు. దేవునికి భార్య ప్రకృతియే. కావున ప్రకృతిని లింగముకింద పాణిమట్టముగా ఉంచారు. అందువలన ఆకారమున్న పార్వతిని ప్రక్కన ప్రతిష్ఠించెడివారు కాదు. కృతయుగములో పూర్తి దైవత్వ సంబంధ విషయము తెలియునట్లు, ప్రకృతి, పరమాత్మ, వారిచే సృష్ఠించబడుచున్న జీవులను లింగప్రతిష్టలో చూస్తూనే అర్థమగునట్లు ఉంచారు. పూర్వము జ్ఞానులు ఎంతో జ్ఞానముతో లింగప్రతిష్టను బయలులోనే చేసి, ప్రక్కన ఏ ప్రతిమ లేకుండ ఉంచారు. దేవునికి వాహనము ఏది లేదు కావున ఈ కాలములోనున్న నందివాహనము కూడ పూర్వములేదు. కాలక్రమమున మాయ ప్రభావము ఎక్కువైపోయి అజ్ఞానము పెరిగిపోయిన దానివలన లింగము గర్భగుడిలో పెట్టడమూ, లింగము ప్రక్కలో పార్వతిని పెట్టడమూ, ఎదురుగా నందిని పెట్టడము జరిగినది. దీనినంతటిని సమర్థించుకొనుటకు కొందరు పురాణముల పేరుతో కథలు కూడ అల్లుకొన్నారు. మెడలో పామున్న శంకరుడు మహర్షి శాపమువలన రాయిగా మారాడనీ, ఆ రాయియే లింగమని ప్రచారము చేశారు. అమాయక ప్రజలు దానినే నిజమని నమ్మారు.

మెడలో పామున్న నటరాజైన శంకరునికి, లింగరూపములోనున్న ఈశ్వరుడైన పరమాత్మకు ఏమాత్రము సంబంధములేదు. శంకరునికి భార్య పార్వతి ఉన్నది, అట్లే కొడుకులు కూడ ఉన్నారు. ఈశ్వరునికి ఆకారములేదు శంకరునికున్నట్లు కుటుంబములేదు. చాలామంది ప్రజలు శంకరుడనినా, ఈశ్వరుడనినా, శివ అనినా ఒకటే అని అనుకొంటున్నారు. అట్లు అనుకోవడము చాలా పొరపాటు. శంకరుడు త్రిమూర్తులలో ఒకడుకాగా, ఈశ్వరుడనినా, శివుడనినా విశ్వమంతా ఆవహించిన పరమాత్మయని తెలియవలెను. పరమాత్మకు రూపమేకాదు పేరుకూడలేదు.

దానిప్రకారము 'ఈశ్వర' 'శివ' అనునవి పేర్లుకాదు. పరమాత్మయొక్క గొప్పతనమును తెలియ జేయు అర్థముతో కూడుకొన్న పదములేగాని పేర్లు కావు. 'ఈశ్వర' అనగా అధిపతియని అర్థముగలదు. సర్వేశ్వరుడు అనగా సర్వమునకు అధిపతి పరమాత్మయని అర్థము. 'శివ' అనగ అగ్నికి నీరుకు గుర్తయిన బీజాక్షరములు అని తెలియవలెను. **ఓం నమః శివాయ** అను శబ్దమును లింగము వద్దనే ఉచ్చరించవలెను. ఆకారమున్న శంకరునివద్ద ఉచ్ఛరించకూడదు. శంకరునికి, పంచాక్షరి అని పేరుగాంచిన ఓం నమః శివాయకు ఏమీ సంబంధములేదు. పరమాత్మ ప్రకృతికి కూడ నాశనము కానివాడని తెలుపుటకు పంచాక్షరి అను పదముగా ఓం నమఃశివాయ అన్నారు. ఈ శబ్దములో ప్రకృతి అయిన పంచ భూతములకు పరమాత్మ నశించువాడు కాదని **'ఓం'** ను పరమాత్మ యొక్క బీజాక్షరముగా పెట్టారు. అట్లే **న** అను దానిని ఆకాశముయొక్క బీజాక్షరముగా, **మః** అనుదానిని గాలియొక్క బీజాక్షరముగా, **శి** అను అక్షరమును అగ్ని యొక్క బీజాక్షరముగా, **వ** అను దానిని నీరు యొక్క బీజాక్షరముగా, **య** అను దానిని భూమియొక్క బీజాక్షరముగా పెట్టి చూపించారు. ఐదు అక్షరములకు నాశనముకానిది **పంచ అక్షరీ** అన్నారు.

పంచ అనగా ఐదు అక్షరములనీ, ఆ ఐదు **నమఃశివాయ** అనునవి కాగ ఆరవ అక్షరముగా మొదటనే **ఓం** గలదు. పంచభూతములకు అతీతమైన దైవమునకు గుర్తుగా ఓం ఉండగా, పంచభూతములైన ప్రకృతికి గుర్తుగ నమఃశివాయ గలవు. పూర్తి జ్ఞానము తెలిసిన జ్ఞానులు పరమాత్మను ఆశ్రయింతురు. జ్ఞానము తెలియనివారు ప్రకృతినే ఆశ్రయించెదరు. ప్రకృతిని ఆశ్రయించిన అజ్ఞానులు కూడ దైవమును తలచునట్లు ప్రకృతిలోని అగ్ని, నీరు బీజాక్షరములను తీసుకొని 'శివా' అన్నారు. దీని వలన జ్ఞానులు 'ఈశ్వరా' అనినా, అజ్ఞానులు 'శివా' అనినా ఇరువురూ దేవున్ని తలచినట్లే

అగుచున్నది. **'శి'** అగ్నికీ, **'వా'** నీటికి గుర్తు, లేక బీజాక్షరమనుకున్నాము కదా! ఇక్కడ అగ్ని నీరునే ఎందుకు తీసుకొన్నారని ప్రశ్నరాగలదు. దానికి జవాబు ఏమనగా! అగ్నిని నీరు క్రింద పెట్టితే నీరు వేడెక్కి అవిరై కనిపించకుండ పోవును. ఒకవేళ నీరునే అగ్నిమీద పోస్తే నీటికి అగ్ని ఆరిపోయి లేకుండ పోవును. ఈ విధముగా నీటి వలన అగ్ని, అగ్ని వలన నీరు లేకుండ పోవు అవకాశము కలదు. అట్లే భూమి గాలినీ, గాలి భూమినీ లేకుండ చేయలేదు. కనిపించని ఆకాశము దేనికి నాశనము కాదు. అందువలన ప్రకృతిలోని గుర్తులైన అగ్ని, నీరుకు మాత్రమే ఒకదానికొకటి నాశనము చేసుకొను శక్తి కలదు. ఏమి జ్ఞానము తెలియనివారు కూడ కొంత జ్ఞానమును తెలుసుకొనుటకు, వారు కూడ పరమాత్మను తలచుటకు పెద్దలు నిర్ణయించిన శబ్దము **'శివా'.** అందువలన పూర్వము జ్ఞానము బాగా తెలిసిన పండితులు పరమాత్మను ఈశ్వరా అని పిలువగా, పూర్తి జ్ఞానము తెలియని అజ్ఞానులు శివా అని తలచెడివారు. దీనివలన పిలిచెడి శబ్దమును బట్టి వీరు పూర్తి జ్ఞానులు, వీరు పూర్తి జ్ఞానులుకాదని వినినవారికి కూడ తెలిసిపోయెడిది. పూర్వకాలమట్లుండగా నేడు శివా అని ఎవరనాలో, ఈశ్వరా అని ఎవరనాలో తెలియకుండ పోయినది. కర్ణాటక రాష్ట్రములో జ్ఞానులు అజ్ఞానులు ఇరువురూ శివా అను పదమునే ఎక్కువగా పలుకుచున్నారు.

పూర్వము ఓం నమఃశివాయ అను ఆరు అక్షరముల శబ్దమును పంచాక్షరి అనుటలో ప్రకృతిలోని భాగములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అనునవి మొదటి అక్షరముగానున్న పరమాత్మను నాశనము చేయలేవు అని అర్థము వచ్చునట్లు పంచాక్షరి అన్నారు. కానీ అది ఓం నమఃశివాయ అను పంచాక్షరి స్థూలముగా ఐదక్షరములు కాదు ఆరక్షరములని తెలియుచున్నది. దైవము వైపు నుండి పలుకుచున్న ఈశ్వరా

అనుటకు, ప్రకృతి వైపునుండి పలుకుచున్న శివా అనుటకు అర్థమునెలా తెలియలేక పోయామో, అలాగే పంచాక్షరిలో ఆరు అక్షరములున్నాయనీ, దాని అర్థము పంచ భాగములుగా ఉన్న ప్రకృతికి ఒక్క భాగముగా ఉన్న పరమాత్మ నాశనము కానివాడని కూడ తెలియలేక పోయాము. ఈ విధముగా పూర్తి వివరము తెలియని పరిస్థితిలో మానవుడుండగా శివరాత్రి యొక్క అర్థము, దాని ఉద్దేశ్యము ఎలా తెలుస్తుంది. అటువంటపుడు శివరాత్రి పండుగకు మనిషి పూర్తి న్యాయము చేయగలడా? అర్థముతో కూడుకొన్న ఆచరణను పండుగరోజు ఆచరించగలడా? అందువలన పంచాక్షరి అనుమాటకు, ఈశ్వరా అనుమాటకు, శివా అను శబ్దమునకు అర్థమును వివరముగా చెప్పుకోవలసివచ్చినది. అంతేకాక **శంకరునికి, ఈశ్వరునికి సంబంధము లేదనీ, శంకరుడు శరీరమున్నవాడని, పరమేశ్వరుడు శరీరము లేనివాడని చెప్పవలసి వచ్చినది.** ఇంకనూ చెప్పితే శంకరుడు కూడ ఈశ్వరున్ని గురించి ధ్యానించెడివాడనీ, మోక్షము కొరకు ప్రార్థించెడివాడనీ యోగదండమునుపయోగించి చర్మాసనము మీద బ్రహ్మయోగమును ఆచరించెడివాడని చెప్పవలసి వచ్చినది. ఇవన్ని మొదట తెలిస్తేనే శివరాత్రి పండుగకు అర్థము సులభముగా తెలియగలదు. ఇపుడు మేము చెప్పినదంతయు క్రొత్త విషయమే కావున క్రొత్త ఆహారము తిన్నవారికి అరగనట్లు కొందరికి ఈ విషయము జీర్ణము కాకపోవచ్చును. మీకు అర్థము కానంతమాత్రమున, మీకు నచ్చనంత మాత్రమున మమ్ములను దూషించినా, అజ్ఞాని అనినా ఇంకా ఏమైనా చెడుగా అనినా నిమిత్త మాత్రుడైన నేను మాత్రము ఓర్చుకోగలను. కానీ మాలో నేను కాక రెండవవాడైన ఆత్మ ఉన్నాడు కదా! వాడు ఓర్చుకోడు. పెద్దపాపమును మీకు అంటగట్టుతాడు. అది దేవుని జ్ఞానమునకు సంబంధించిన పాపము కావున అనుభవించేటపుడు చాలా భయంకరముగా ఉంటుంది జాగ్రత్త!!

జీవుడు శరీరములో జీవిస్తున్నాడంటే పాపపుణ్యమను కర్మ ఉన్నదని తెలియుచున్నది. ఎపుడు కర్మ అయిపోతే అపుడు జీవుడు ముక్తిపొంది దేవునియందైక్యమవుతాడు. **ముక్తి పొందుటకే మనము జ్ఞానము తెలుసుకోవలసినది. జ్ఞానము తెలుసుకొనుటకే పండుగలను ఆచరించ వలసినది.** జీవునికి కర్మ అనునది కట్టెలులాంటిది. కట్టెలు లేని వానికే ముక్తి అను ఇంటిలోనికి ప్రవేశముండును. కట్టెలున్న వానికి ప్రవేశము లేదు. కావున జ్ఞానమను అగ్నితో కట్టెలను కర్మను లేకుండ చేసుకోవాలి. అందువలన జీవుడు ముక్తి పొందుటకు కావలసినది జ్ఞానమను అగ్ని. దానివలన పంచభూతములలో కాల్చు అగ్నికి గుర్తయిన 'శి' అను అక్షరమును తీసుకొని, కాలిపోవు కట్టెలవలె ఆవిరియైపోవు నీటికి గుర్తయిన 'వా' ను తీసుకొని శివా అన్నారు. దీని ప్రకారము 'శివా' అనడములో జ్ఞానాగ్నితో కర్మ అను కట్టెలను లేకుండ చేసుకుంటానని అర్థము. జ్ఞానము వలన కర్మపోతే ముక్తిని పొందవచ్చును, అనగా దైవమును పొందవచ్చును. దేవుడు త్రిగుణరహితుడు. గుణములున్నది పగలని, రాత్రి గుణములుండ వనీ, అందువలన మాయకు గుర్తు పగలనీ, దేవునికి గుర్తు రాత్రియనీ **'సుబోధ'** అను గ్రంథములో చెప్పుకొన్నాము. జ్ఞానమను అగ్ని వలన కర్మలను కట్టెలను ఆహుతి చేసి, మూడు గుణములులేని రాత్రి అను దేవున్ని పొందుతాను అను భావముతో కాల్చే అగ్నికి గుర్తుగ **'శి'** అనియూ, కాల్చబడే కర్మకు గుర్తుగా **'వా'** అనియూ, పొందబడే దేవునికి గుర్తుగా రాత్రి అనియూ అర్థముతో పూర్వము యుగాది తర్వాత మొట్టమొదట పెట్టిన పండుగ "శివరాత్రి". చూచారా! శివరాత్రిలో ఇమిడియున్న అర్థము ఎంత గొప్పదో!!

మానవునికి మోక్షమును సూచించు శివరాత్రిని పెద్దలు మొదట పండుగగా పెట్టి చూపించగా, కృతయుగమునుండి త్రేతాయుగము,

త్రేతాయుగము నుండి ద్వాపరయుగము, ద్వాపరయుగము నుండి కలియుగము వచ్చేటప్పటికి మాయ ప్రభావము వలన శివరాత్రికి అర్థమే తెలియకుండ పోయినది. శివరాత్రి అంటే శంకరున్ని పూజించు దినముగా, ఓం నమఃశివాయ శంకరుని నినాదముగా అందరూ అనుకొనుచున్నారు. కానీ పరమాత్మనుగానీ, మోక్షమునుగానీ ఎవరు గుర్తు చేసుకోవడములేదు.

రుద్రుడనినా, శంకరుడనినా ఇద్దరూ ఒక్కటే. శంకరుడు, నేను జ్ఞానిని అన్నట్లు జ్ఞానమునకు చిహ్నమైన చంద్రవంకను తలమీద ఉంచు కొన్నాడు. ఆయనకు జ్ఞానము తెలిసిన దానివలన యోగమునకు కావలసిన చర్మమును ఆసనముగా చేసుకొని, యోగదండమును ఉపయోగించుచు దైవమునందు మనస్సు లగ్నము చేసెడివాడు. ఈ విధముగా రుద్రుడైన శంకరుడు, ఈశ్వరున్ని పొందవలెనని ప్రయత్నిస్తుండగా, ఆయన దారిలో మనము కూడ నడచి శివరాత్రిని అసలైన అర్థముతో చేసుకోక, శివరాత్రిని శంకరుని దినముగా భావించడము పొరపాటు కాదా? పూర్వము నుండి ఉన్న ఆచారము ప్రకారము ఈశ్వర లింగమును ఎదురుగా పెట్టుకొని దానిని శంకరునిగా తలుచుకోవడము పొరపాటు కాదా? సృష్ఠి రహస్యమును తెలియజేయు లింగము ప్రక్కలో పార్వతిని భార్యగ, నందిని వాహనముగా పెట్టడము పొరపాటు కాదా? దీనికంతటికి మూల కారణము అజ్ఞానమే. కట్టుకథలతో కూడుకొన్న పురాణములను కొందరు ప్రచారము చేయుట వలన ఏర్పడిన మౌఢ్యము చేత, విశేష అర్థముతో మనముందరే లింగమున్నా దానిని శాపముతో రాయిగా మారిపోయిన శంకరుడనుకొనుచున్నారు. రూపములేని లింగమునకు కొందరు అజ్ఞానముతో తెలియక శంకరుని ముఖ ఆకారమున్న రేకును తగిలించుచున్నారు. లింగమునకు ముఖ ఆకారమును కరిపించడము వలన లింగము యొక్క అర్థమునకే భంగము ఏర్పడుచున్నది. ఇంతవరకు ఎంతో అజ్ఞానముతో సృష్ఠికి మూల కారణమైన దేవున్ని లింగాకారముతో చూడక శంకరునిగా తలచాము. ఇప్పటినుండైన

ఈశ్వరున్ని లింగముగా, శంకరున్ని రుద్రభూమినందు సంచరించు రుద్రునిగా చూడవలెను. శివరాత్రిని కర్మనాశనమైన మోక్షరాత్రిగా చూడవలెను.

ప్రస్తుత కాలములో శివరాత్రి దేశవ్యాప్త పండుగ అయినా ఒక ప్రాంతములో కూడా పూర్వమున్న సాంప్రదాయమును అనుసరించి జరుగడములేదు. పూర్వము ఇందూ (హిందూ)త్వము జ్ఞానముతో ముడిపడి ఉండెడిది. నేడు ఇందూత్వము రాజకీయముతో ముడిపడి ఉన్నది. దైవజ్ఞానములేని రాజకీయము హిందూత్వ ముసుగు వేసుకొని మాలాంటి వారిని కూడ ఆత్మజ్ఞానమును చెప్పకుండ అడ్డుపడుచున్నది. మనుషులు నడిచే అజ్ఞానమార్గమును ఖండించి జ్ఞాన మార్గమును బోధించడము మాధ్యేయము. హిందువులు దైవమార్గములో సరిగా లేకపోతే మీరు ఇక్కడ అజ్ఞానముగా నడుస్తున్నారు. దేవుడు చెప్పిన భగవద్గీత గ్రంథానికే వ్యతిరేఖముగా ఉన్నారని చెప్పడము మా కర్తవ్యము. ఎందరో వేదాంతులు కూడ జ్ఞానమునకు వ్యతిరేఖముగా నడుస్తుంటే, మేము వారికి కూడ వేదములు ప్రకృతి జనితములనీ దైవజనిత భగవద్గీత అందరికీ ఆమోదయోగ్యమైనదనీ, అదియే నిజమైన జ్ఞానమని చెప్పాము. అలాగే హిందువులై కూడ భగవద్గీత ప్రకారము నడువని వారికి పూర్వము పెద్దలు ఎలా చెప్పారో చూడండని సరియైన జ్ఞానమును తెల్పుచున్నాము. జ్యోతిష్య శాస్త్రము ప్రకారమూ, మా జాతకము ప్రకారమూ భూమిమీద మేము చేయవలసిన పని తెలియకుండ పోయిన జ్ఞానమును చెప్పడమే. మేము శాస్త్రబద్ధముగా, పురాణరహితముగా జ్ఞానము తెల్పుచుంటే, ఎన్నో తెలియని రహస్యములు వీరి ద్వారా తెలియుచున్నవి కదా!యని సంతోషపడక మమ్ములను జ్ఞానము చెప్పవద్దని బెదిరించు హిందువులున్నారంటే, హిందువులు ఎంత అజ్ఞానములో చిక్కుకొని పోయారో అర్థమగుచున్నది. నేను ఇందువు (హిందువు)గా పుట్టినందుకు, హిందువులకు సంపూర్ణ జ్ఞానమును కల్గించాలనునదే మా ఉద్దేశ్యము. ఆ ప్రయత్నము లోపలి ఆత్మ చేయిస్తూ

ఉంటే నేను చేస్తూవుంటాను. అంటే మేము జ్ఞానమును బోధిస్తూనే ఉంటాము.

శివరాత్రి కర్మనిర్మూలనకు, మోక్షప్రాప్తికి గుర్తుకావలెను. కానీ కర్మ సంపాదనకు గుర్తుకాకూడదు. నేటికాలములో శివరాత్రి దినమున కొందరు జాగరణ అను పేరుతో రాత్రిపూట మేల్కొనుచున్నారు. ఆ దినము మేల్కొనవలెనని తెలుసు, కానీ ఎందుకు మేల్కోవాలి? మేల్కొని ఏమి చేయాలని తెలియదు. శివరాత్రి దినమున రాత్రికి సినిమాలు, షికార్లు, త్రాగడము, వేశ్యలతో గడపడము చేయుచున్నారు. కొందరైతే గర్ల్‌ఫ్రెండ్‌తో ఎంజాయి చేశానని గర్వముగా చెప్పుకొంటున్నారు. ఈ విధముగా నేటి సమాజములో యువత మారిపోవుచుండగా, పెద్దవారు ఏమీ పట్టనట్లున్నారు. ఎన్ని పాపములు చేసినా వేయిరూపాయలు ఖర్చుపెట్టి శివునికి అభిషేకము చేశాములే అవే పోతాయనుచున్నారు. పూజలు చేయు పండితులు కూడా పాపపరిహారార్థము పూజలున్నాయనుచున్నారు. దానివలన పాపము యొక్క భయము ఎవరికీ లేకుండాపోయి డబ్బులు ఖర్చుపెట్టి పూజలో, అభిషేకములో చేస్తే పాపము పోతుందను భావము అందరిలోను ఉన్నది. దానితో శివరాత్రి దినమున కూడ ఆ పండుగ సరదాకోసమే అన్నట్లు చేయుచున్నారు. సాంప్రదాయము ప్రకారము పండుగ రోజున, గడచిన కాలమును గురించి యోచించి, నేను ఎంత పండినానని లెక్క చూచుకోవలసి యున్నది. కర్మను పోగొట్టుకొనుటకు కావలసిన జ్ఞానము కొరకు వెతుక్కోవలసియున్నది. తాము మాయనుండి జాగృతిపడుచు ఎదుటివారిని కూడ జాగ్రత్త చేయవలసిన దినము కావున **'శివరాత్రి జాగరణ'** అని ఆ రాత్రిని అన్నారు. అంతేకాని నిద్ర పోకుండ మేల్కొనడము జాగరణ కాదని తెలియవలెను.

చదువురాని పామరులు ఏదైనా ఇతరులను అనుసరించి చేస్తున్నారంటే ఒప్పుకోవచ్చును. కానీ విద్యావంతులు, విజ్ఞానవంతులు

ఇతరులు చేయుచున్న దానిని వివరముగా తెలుసుకోక గ్రుడ్డిగ చేయుచున్నా రంటే దానికి అర్థమే లేదు. శివరాత్రి యొక్క విషయములోగానీ, మరికొన్ని పండుగల విషయములో గానీ ఏమాత్రము వివరమడుగక, కనీసము తెలుసుకుందామనే ప్రయత్నమూ చేయక, గ్రుడ్డిగ చేస్తూ పోతుండడము వలన, హేతువాదులడుగు ప్రశ్నలకు జవాబు చెప్ప లేకపోవుచున్నారు. విద్యావంతులు కూడా సరియైన జవాబు చెప్ప లేకపోవడము వలన, ఇదంతయు మూఢభక్తి, మూఢ నమ్మకమని హేతువాదులు కూడ దేవుడే లేడనుచున్నారు. ఇప్పటికే జ్ఞానమంటే ఏమిటని కొంత యోచించువారికి, జవాబు దొరకక పరమతమును కొందరు ఆశ్రయించుచుండగా, కొందరు నాస్తికవాదులుగా మారిపోవుచున్నారు. ప్రజా విజ్ఞాన వేదికలను పేరుతో దేవుడే లేడనీ, భగవద్గీత బూటకమనీ, జ్ఞానమును చెప్పువారంతా మోసగాళ్ళని కొందరు అనుచున్నారు. మాలాంటి వారు జ్ఞానమును చెప్పుచుంటే అర్థముకాక మీది హిందూమతమునకు వ్యతిరేఖమైన జ్ఞానమని మండిపడే కొన్ని సంస్థలకు ఇటువంటి హేతువాదులూ, విజ్ఞాన వేదికలు కనిపించలేదా? ఇప్పటికైన మేము హిందువులమని రాజకీయ రంగు పూసుకోకుండ, మేల్కొని అజ్ఞానములో కూరుకుపోవుచున్న హిందువులను కాపాడాలని మనవి చేయుచున్నాము. ముందు నీవు జ్ఞానము తెలుసుకో! తర్వాత ప్రక్కవానికి జ్ఞానము చెప్పు, అప్పుడైతేనే మనమూ బాగుపడగలము, మన సంస్కృతిలోని పండుగలూ బాగుపడగలవు.



# శ్రీరామ నవమి

త్రేతాయుగములో దశరథమహారాజుకు కుమారునిగా రాముడు పుట్టాడు. ఆ రోజు గ్రహచారమును బట్టియో లేక మహర్షుల మాటను

బట్టియో "రామ" అను రెండక్షరముల పేరు దశరథపుత్రునికి పెట్టారు. ఆ పేరుకు ముందు గౌరవప్రదముగ, శుభప్రదముగ "శ్రీ" అను అక్షరమును చేర్చి "శ్రీరామ" అని కొందరన్నారు. శ్రీ అనునది మధ్యలో గౌరవమునకు చేర్చినదే కానీ అసలు పేరులోనిది కాదనీ, రామ అను రెండక్షరముల పేరు అసలైన పేరని తెలియాలి. రామ అను రెండక్షరముల పేరు చాలాగొప్ప అర్థము నిచ్చునదై ఉన్నది. అందువలన కొందరు జ్ఞానమును తెలిసిన పెద్దలు రామ అను పదమును అప్పుడప్పుడు అనుకొనమని చెప్పెడివారు. పెద్దలు చెప్పిన దానివలన కొందరు కూర్చున్నపుడు, లేచినపుడు రామ అని అనడము అలవాటు చేసుకొని ఉండెడివారు. పూర్వము అలా రామ శబ్దమును చాలామంది పలికెడివారు. నవీనకాలములో చదువులు ఎక్కువై విజ్ఞానము పెరిగిన కొలది పూర్వకాలము రామ అన్నట్లు ఇపుడు ఎవరు అనడము లేదు. ఇందులో విశేషమేమంటే పూర్వకాల పద్ధతి ప్రకారము ఎవరైనా అనేవారు ఉండినా, వారు రామ అని రెండక్షరములనే అంటారు. కానీ శ్రీరామ అని మూడక్షరముల పదమును పలుకరు. ఉత్తర భారతదేశములో చాలామంది ప్రస్తుతకాలములో కూడ ఒకరికొకరు పరిచయమున్నవారు ఎక్కడైన ఎదురైతే రామ్‌రామ్ అని చెప్పుకొనుట చూడవచ్చును. ఎదుటి వ్యక్తికి గౌరవముగ నమస్తే అని చెప్పుటకు బదులు రామ్‌రామ్ అనుట గలదు. రాజస్థాన్ గుజరాత్ రాష్ట్రములలోని ప్రజలలో రామ్‌రామ్ అను అలవాటు పూర్తిగ కనిపిస్తున్నది. పూర్వము నుండి అటువంటి మంచిపద్ధతిని మన పెద్దలు మనకు అలవాటు చేశారు. 'రామ' అను పదములోని విశిష్టత అలాంటిది. కబీర్‌దాస్ మొదలగు జ్ఞానులు కూడ రామ శబ్దమును విడువక తలచెడివారు.

ఇప్పటికాలములో కొందరు హేతువాదులు రామునిలో ఏమి గొప్పతనమున్నదని ప్రశ్నించుచున్నారు. రాముడు దశరథ పుత్రుడుగా

పుట్టి ఆస్తితగాదాలలో అడవికివెళ్ళి అనేక కష్టములు పడ్డాడు. సీతను పోగొట్టుకొని జాడతెలియక కొన్ని సందర్భములలో రోదించాడు. సామాజిక న్యాయమును కూడ పాటించక భార్యను అదియు గర్భిణి మనిషిని అడవిలో వదలివేశాడు. తండ్రి అని తెలియక ముందు రాముణ్ణి స్వంత కొడుకులే నిందించారు. భర్త అయిన రాముడు సీతను తిరిగి ఇంటికి రమ్మంటే భార్య నిరాకరించింది. ఆయన స్వంత జీవితములోనే ఎన్నో కష్టములను ఎదుర్కొన్న రాముడు దేనిలో గొప్పవాడు? ఆయనకే లేని విశిష్టత ఆయన పేరుకెలా వచ్చినది? అని కొందరు హేతువాదులు ప్రశ్నించుచున్నారు. జీవిత కాలములో ఒక సంవత్సరము కూడ కలిసి కాపురము చేయనివారు ఆదర్శ దంపతులా? శీలవతియైన భార్యను అనుమానించి అడవికి పంపినవాడు గొప్పవాడా? ఆయన దేవుడేకాదు అను నాస్తికులు కూడ గలరు. అంతేకాక ఆ రామునికంటే మా రావణుడే గొప్ప అను దక్షిణదేశ ద్రావిడులు గలరు. ఇటువంటి వారందరికి మేము జవాబు చెప్పలేము. ఎందుకనగా! చెప్పినా పూర్తి వినకుండానే అడ్డముగా మాట్లాడువారికి ఎవరూ జవాబు చెప్పలేరు.

ప్రతి మనిషిలోను మరొకరి గురించి చెప్పుటలో మూడు భావములు వుంటాయి. ఈ మూడింటిని ప్రపంచ భావములంటాము. అవి ఒకటి తటస్థ భావమూ, రెండు విమర్శ భావమూ, మూడు విశ్వాస భావము. ఈ మూడు భావముల ప్రకారము ఏ మనిషైన మరొక మనిషిని లెక్కించు చుండును. అలాగే రాముణ్ణిగానీ, కృష్ణుణ్ణిగానీ విమర్శించువారు గలరు, విశ్వసించువారూ గలరు. మరికొందరు అటు విమర్శించడముగానీ, ఇటు విశ్వసించడముగానీ ఏమి లేకుండ, ఏమి మాట్లాడకుండ తటస్థముగా ఉండువారూ గలరు. ఎవరి భావము వారికి గొప్పగా ఉంటుంది. కాబట్టి మన భావము వారికి నచ్చవచ్చును, నచ్చకపోవచ్చును. అందువలన

నేను ప్రపంచ పద్ధతిలోనున్న ఈ మూడు భావముల ప్రకారము ఏమి చెప్పక, ఈ మూడు భావములకు అతీతముగానున్న ఆధ్యాత్మిక భావము ప్రకారము చెప్పదలచుకొన్నాను. అలా ఎందుకు చెప్పాలనుకొన్నామనగా! ఆధ్యాత్మిక భావములో విమర్శగానీ, విశ్వాసముగానీ, తటస్థముగానీ ఉండదు. ఆధ్యాత్మిక భావము అందరికి సమానముగా ఉండును. ఈ భావము అందరికి సంబంధించినదై, అందరియందు సమానముగా ఉన్నదై ఉండుట వలన శ్రద్ధ ఉన్నవారికి అర్థము కాగలదు. శ్రద్ధలేనివానికి అర్థముకాదు. ఇపుడు మేము చెప్పు ఆధ్యాత్మిక భావమును శ్రద్ధగలిగి అందరు అర్థము చేసుకుంటారను ఉద్దేశ్యముతో చెప్పుచున్నాము శ్రద్ధగా చూడండి.

దశరథ పుత్రుడైన శ్రీరాముని పట్ల విశ్వాసమున్న రాముని భక్తులకు, విశ్వాసములేని నాస్తిక, హేతువాదులకు తెలియని రహస్యమొకటి గలదు. అది ఏమనగా! త్రేతాయుగములోని దశరథ రామునికంటే ముందే కృతయుగములోనే **"రామ"** అను రెండక్షరముల పదము గలదు. రామునికంటే ముందే 'రామ' అను పేరుండుట ఆశ్చర్యమే కదా! ఇపుడు ఆ ఆశ్చర్యకరమైన విషయమును గురించి తెలుసుకొందాము. 'రామ' అను రెండక్షరముల శబ్దమును ప్రజలకు కృతయగములోని జ్ఞానులే పరిచయము చేశారు. రాముడు పుట్టని ఆ కాలములో 'రామ' అను రెండక్షరములకు ఆధ్యాత్మికరీత్యా విశేషమైన అర్థముండెడిది. **'ర'** అనగా అర్థము **"నాశనము"** అని ముందే తెలుసుకొన్నాము. 'ర' అనినా 'రా' అనినా రెండు ఒకే అర్థము నిచ్చుచున్నవని దశరా పండుగను గురించి చెప్పుకొన్నపుడే తెలుసుకొన్నాము. **'మ'** అనగా **నేను** లేక **నా** అను అర్థముగలదని మమ అనగా నాయొక్క అనియు **"సుబోధ"** గ్రంథములో 'మామ' ను గురించి చెప్పుకొన్నపుడు తెలుసుకొన్నాము. ఆ ప్రకారము చూస్తే రామ అను మాటలో నా అనునది నాశనము కావలెనని అర్థమిమిడియున్నది. నేను అనువాడినైన జీవున్ని నాశనమై పోవాలని

అర్థము, ఆ రెండక్షరముల శబ్దములో గలదు. జీవుడు నాశనమైతే దేవునిగా మారిపోగలడు. అనగా దేవునిలో కలిసిపోగలడు. ఒక జీవుడు జన్మరాహిత్యమును కోరుకొంటూ, దేవునియందైక్యమగు అర్థము **"రామ"** అను శబ్దములో ఇమిడియున్నది. బ్రహ్మాజ్ఞానము ప్రకారము ప్రతి జీవుడు దేవునియందైక్యమగునట్లు కోరుకోవలెను. ఆ విధముగానే ప్రవర్తించవలెను. జీవుడు ఎప్పటికైనా దేవునియందు చేరిపోవలసినవాడే. జీవుడు అను మాట లేకుండ పోయి దేవుడను మాటగా మార్పు చెందవలసినదే. అందువలన భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగము అను ఆధ్యాయమున జీవున్ని క్షరుడు అన్నారు. క్షరుడు అనగా నాశనమగువాడని అర్థము. **"నాశనము చెందువాడిని నేను"** అను జ్ఞాపకమును ఎల్లపుడు మనిషి మరిచిపో కుండునట్లు **"రామ"** అను మాటను సందర్భములోగానీ, అసందర్భములో గానీ అపుడపుడు పలుకునట్లు పెద్దలు అలవాటు చేశారు. పూర్వము రెండక్షరముల రామ అను మాటలో ఎంత అర్థముందో అందరికి తెలిసియుండెడిది. కృతయుగములోనే రామ అను శబ్దము ఆధ్యాత్మికమునకు ఆదర్శముగా ఉండెడిది. నేను నాశనమగువాడినని అందరిలో దృఢభావము రామ అను రెండక్షరముల వలన ఉండెడిది. భగవద్గీతలో చెప్పిన క్షరభావము, అనగా నాశన భావము 'ర' వలన, నేను అను భావము 'మ' వలన కల్గుచున్నది. కావున రామ శబ్దము పరమ పవిత్ర అర్థముతో కూడకొన్న శబ్దముగా పూర్వము భావించెడివారు. గొప్ప భావమున్న రామ శబ్దమును దశరథపుత్రునికి నామధేయముగా పెట్టుకొన్నారు. ఆనాటినుండి ఆధ్యాత్మిక జ్ఞానము ప్రజలలో తగ్గిపోవడము వలన రామ అను రెండక్షరములు శ్రీరామ అని మూడక్షరములుగా మారిపోవడమూ, దశరథపుత్రునినుండే రామ అను పేరు వచ్చినదనీ, రామ అనగా దశరథ రాముడేనను భావము అందరిలో ఉండిపోయినది. అదే భావము ఈనాటికి మిగిలిపోయినది.

రామ అంటే దశరథ పుత్రుడే అని రామదాసు అనుకొనగా, రామదాసుకంటే పెద్దవాడైన కబీర్‌దాసు తాను అనుకొను రామ దశరథ రాముడు కాదనుకొన్నాడు. అందువలన ఒక సందర్భములో దశరథ రాముడే కనిపించినా నీవు నా రామునివి కాదు పో! అన్నాడట. నేను తలచు రామవు నీవు కాదు అని శ్రీరాముణ్ణి కబీర్ అన్నాడంటే కబీర్‌కు పూర్వపు జ్ఞానము ఆధ్యాత్మికము ప్రకారము తెలుసునన్నమాట. రామదాసుకు ఆధ్యాత్మికము తెలియక, **రామ** అను మాట శ్రీరాముని పేరేననుకొన్నాడు. ఒక రామదాసే కాదు, ఆనాటి త్రేతాయుగమునుండి ఎందరో దశరథ రాముడే నిజమైన రామ అని తలచినవారు కలరు. అటువంటి వారందరు శ్రీరాముని మీద భక్తిచేత శ్రీరామనవమిని పండుగగా చేయుచున్నారు. శ్రీరామనవమి ఈనాడు భారతదేశమంతా ఆచరించు పండుగగా ఉన్నది. దేవుని వద్దకు చేరాలంటే ప్రథమ మెట్టు భక్తి, కావున భక్తిని శ్రీరాముని మీద పెంచుకొని శ్రీరామనవమిని చేయుటవలన భక్తిలో పరిపక్వత చెందిన వారై చివరకు రామ పదమునకు అర్థము తెలియగలదు. అందువలన శ్రీరాముని మీద భక్తితోనైనా అప్పుడప్పుడు రామ అను కొనుటకు అలవాటు పడితే మంచిది. అలా అలవాటుపడడము వలన చివరకు ఏనాడైనా రామ శబ్దమునకు అర్థము తెలుసుకొనుటకు అవకాశ మొచ్చును. రామా అని ఏదో ఒక రూపముతో అనుకోకపోతే ఆ రెండక్షరముల భావము తెలియుటకు అవకాశముండదు కదా! కావున రాముని మీద భక్తితోకానీ, కోపముతోగానీ అహర్నిశలు రామ అను శబ్దమును పలుకుట మేలని పెద్దలన్నారు.

'రామ' అనినా అదే పదమును త్రిప్పి 'మరా' అనినా అర్థము మాత్రము ఒకటే. కావున నారదమహర్షి వాల్మీకికి మొదట "మరా" అను శబ్దమునే మంత్రముగా బోధించాడట. వాల్మీకికి నారదుడు, దశరథరాముడు పుట్టకముందే 'మరా' శబ్దమును మంత్రముగా ఉపదేశించాడు. అదే 'మరా'

శబ్దమునే ఉచ్చరిస్తూ వాల్మీకి ఎన్నో సంవత్సరముల ఘోరతపస్సు చేశాడు. మరా శబ్దమును ఉచ్చరిస్తూ ఎన్నో సంవత్సరములు ఉండిపోవుట వలన అతను కూర్చున్న స్థలములో పుట్టపెరిగి పోయినది. పుట్టను వల్మీకము అంటారు. చాలాకాలము తర్వాత పుట్టనుండి బయటికి వచ్చినవాడు కనుక అతనిని వాల్మీకి అన్నారు. వాల్మీకిని ఆదికవి అంటే అతను ఎంతటి ముందువాడో మీరే యోచించండి. రామ అను పదము యొక్క అర్థము తెలిసిన వాల్మీకి ఆ పేరున్న రాముని చరిత్ర అయిన రామాయణమును వ్రాయగలిగాడు. రామాయణముకంటే ముందు కూడ కొన్ని చరిత్రలు కవులు వ్రాసినవి గలవు, అంటే వాల్మీకి ఆదికవి కావున ఆయన రామునికంటే చాలా ముందు కాలపువాడని సులభముగా అర్థమగుచున్నది. వేల సంవత్సరములు బ్రతికిన వాల్మీకి వృద్ధాప్యములో రాముని చరిత్రను రామాయణముగా వ్రాశాడు.

త్రేతాయుగమునుండి ప్రాచుర్యములోనికి వచ్చిన శ్రీరామనవమిని పండుగగా ఆచరించడము వలన, రామ అను శబ్దము పలుకుట వలన, ఆధ్యాత్మికము అంటే ఏమిటో తెలియని వారికి కూడ ఎప్పుడైనా తెలుసుకొనుటకు అవకాశము రాగలదు. రామ అను పదము పవిత్రమైనదని తెలియగలదు. అందువలన శ్రీరామనవమిని పండుగగా చేయువారందరూ ఆ దినము క్రొత్తగుడ్డలు ధరించి, క్రొత్తతిండి తినడమేకాకక క్రొత్త జ్ఞానమును తెలుసుకొనుటకు ప్రయత్నించవలెను. శ్రీరామనవమి దినము వడపప్పు, పానకమును ప్రసాదముగా పంచుకోవడమేకాక **జ్ఞానమును, యోగమును** ప్రవచనముగా చెప్పుకోవలెను. ఈ విధముగా అటు బయటి దశరథ రామున్ని ఆరాధించైనా లోపలి **ఆత్మారామున్ని** తెలుసుకోనుటకు ప్రయత్నించండి. ఇప్పటినుండి ఉత్తరాయణములో వచ్చు శ్రీరామ నవమిని అర్థముతో ఆచరించి సరియైన జ్ఞాన ఫలితమును పొందవలెనని తెలుపు చున్నాము.

# శ్రీకృష్ణ జన్మాష్టమి

శ్రీకృష్ణుడు పుట్టినది క్రీస్తు పూర్వము 3228 సం॥ జూలై నెల 19వ తేదిన బహుళ అష్టమి దినమున వృషభలగ్నములో పుట్టాడు. దీనినిబట్టి ఇప్పటికి 5238 సంవత్సరముల పూర్వము కృష్ణుడు భూమిమీద పుట్టాడని తెలియుచున్నది. అర్థము చేసుకొంటే ఆయన జీవితమే గొప్ప జ్ఞాన సందేశమని చెప్పుకొన్నాము కదా! దానిప్రకారము ఆయన జన్మలో కూడ గొప్ప జ్ఞానము ఇమిడి ఉన్నదని చెప్పవచ్చును. కృష్ణుడు ఎదురుకాళ్ళతో పుట్టడమే ఒక విశేషమైతే, ఆయన పుట్టిన అష్టమి దినము కూడ విశేషతను సంపాదించుకొన్నది. కృష్ణుని జన్మాష్టమి యొక్క విశేషమేమిటని చూచిన ఈ విధముగా అర్థము కాగలదు. సర్వసాధారణముగ ఏమీ జ్ఞానము తెలియని ప్రజలు కూడ **"అష్టమి కష్టము, నవమి నష్టము"** అని అంటూ అష్టమి, నవమి దినములలో కొన్ని పనులను చేయరు. కొన్ని పనులు ప్రారంభించే ముందు ఈ రెండు తిథులను లేకుండ చూచుకొంటారు. నవమి నష్టము, అష్టమి కష్టము అనడములో మీ భావమేమి అని కొందరినడిగితే వారు ఇలా చెప్పుచున్నారు. "అష్టమి రోజు పని ప్రారంభించితే ఆ పని కష్టముతో కూడుకొన్నదగును. అలాగే నవమి రోజు ప్రారంభించితే ఆ పని నష్టములతో కూడుకొన్నదగును" ఇలా వారు అన్న మాటలను బట్టి చూస్తే ఇది జ్యోతిష్యశాస్త్రము ప్రకారము జరుగునది కాదు. జ్యోతిష్యశాస్త్రములో అటువంటి సూత్రము ఏది లేదు. అయినప్పటికి పూర్వకాలము ఈ మాట చాలా ప్రచారములో ఉండెడిది. దాదాపు యాభై సంవత్సరముల క్రిందటి వరకు అష్టమి, నవమి అను మాటలు అక్కడక్కడ వినిపించెడివి. ప్రస్థుత నవీన కాలములో ఆ మాట కరువై పోయినది. ఇప్పటి చదువులలో పడిన పిల్లలకు తిథులంటే కూడ ఏమిటో తెలియకుండ పోయినది. ఇప్పటికి కూడ ఎక్కడైన పల్లెప్రాంతములలో ఈ రోజు అష్టమి, 'అష్టమి రోజు ప్రయాణమా' అనుటగానీ, ఇంతకాలముండి ఇప్పుడు 'అష్టమి దినమునా ప్రారంభించేది' అనిగానీ అనుట గలదు. దీనిని బట్టి అష్టమి,

నవమి అను రెండు తిథులలో ఒక తిథి నవమి గాలికి పోయింది. అష్టమి మాత్రము మిగిలివుంది అని అర్థమగుచున్నది. పల్లె ప్రాంతములలో ఎక్కడో ఒకచోట ఇంతవరకు మిగిలిన అష్టమి కూడ పది సంవత్సరముల కాలమునకు లేకుండ పోతుందని తెలియుచున్నది. 'అష్టమి కష్టము, నవమి నష్టము' అని ఉండెడిదని చెప్పు మా మాటలకు కొంత ఆధారముగా ఇప్పటికీ అష్టమి మిగిలి ఉన్నది. కాలగమనములో ఎన్నో కనుమరుగై పోయాయి. అయినప్పటికీ జ్ఞానమునకు విలువను చేకూర్చే మాటలు కనుమరుగు కాకూడదని మా అభిలాష. అందువలన అష్టమి కష్టము, నవమి నష్టము అను మాటను పెద్దలు ఎందుకు అమలులోనికి తెచ్చారు? ఎప్పటినుండి అమలులోనికి వచ్చింది? అను ప్రశ్నలకు జవాబులు వెదుకుకొందాము.

అష్టమి కష్టము, నవమి నష్టము అనుమాట శ్రీకృష్ణుడు పుట్టక ముందు లేదు. కృష్ణుడు పుట్టిన తర్వాత 90 సంవత్సరములకు భగవద్గీతను చెప్పాడు. భగవద్గీతను చెప్పిన తర్వాత కృష్ణుడు గొప్పవాడను విషయము కొందరికి అర్థమైనది. అప్పటినుండి కృష్ణుడు పుట్టిన దినమును గోకులములోను, మధురలోను పండుగగా చేసుకోవడము జరుగుచున్నది. భగవద్గీత యుద్ధరంగములో చెప్పబడినది. భారతయుద్ధము క్రీస్తు పూర్వము 3138వ సంవత్సరము జరిగినది. దీనినిబట్టి ఇప్పటికి భగవద్గీత పుట్టి 5148 సంవత్సరములు అయినది. భగవద్గీత పుట్టిన తర్వాత కృష్ణుడు సామాన్య మనిషి కాదని కొందరు జ్ఞానులు గ్రహించగలిగారు. అప్పటి నుండి శ్రీకృష్ణ జయంతిని చేయుటకు పూనుకొన్నారు. అలా ఏర్పడినదే శ్రీకృష్ణ జన్మాష్టమి. అప్పటినుండి శ్రావణమాస బహుళ అష్టమి రోజు శ్రీకృష్ణుని జన్మదినమును పెద్ద పండుగగా చేసుకొనెడివారు. ఆ విధముగా దైవజ్ఞానము తెలిసినవారు ప్రారంభించిన శ్రీకృష్ణాష్టమి కొంత కాలమునకు దేశవ్యాప్తముగా అందరూ చేయుట మొదలుపెట్టారు. భగవద్గీతను చెప్పిన తర్వాత కృష్ణుడు 36

సంవత్సరములకు చనిపోయాడు. కృష్ణుడు సజీవముగా ఉన్నప్పుడే కృష్ణ జయంతిని కృష్ణాష్టమిగా చేయుట జరిగినది. ద్వాపరయుగములోనే 'కృష్ణాష్టమి' పండుగ తయారైనది.

కృష్ణుడు చనిపోయిన రెండు సంవత్సరములకే కలియుగము ప్రారంభమైనది. కలియుగ ప్రారంభములో దేశమంతా ముఖ్యమైన పండుగగా శ్రీకృష్ణాష్టమి జరిగెడిది. కలియుగములో కృష్ణాష్టమి దేశవ్యాప్తముగా ఐదు ఆరువందల సంవత్సరముల వరకు ఉత్సవముగా జరిగినది. అప్పటినుండి మాయా ప్రభావముచేత క్రమేపి కృష్ణాష్టమి పండుగ చేయడము ఒక్కొక్కరు మానివేస్తూ వచ్చారు. ఆ విధముగా నాలుగు లేక ఐదువందల సంవత్సరములకు కృష్ణాష్టమిని చేయడము 90 శాతము మంది మానివేశారు. చివరకు కొంతకాలమునకు కేవలము ఐదుశాతము మంది మాత్రమే అదియు మధుర, గోకులమైన నందగావ్ పరిసరప్రాంతములలో మాత్రము చేయడము, గొల్లవారు మాత్రము చేయడము ఆనవాయితీగా ఉన్నది. గొల్లవాడలయందు కృష్ణుడు చిన్నతనములో చేసిన వెన్న దొంగతనమును గుర్తు చేయుటకు ఉట్టిని పగుల గొట్టడము మొదలగు కార్యములను పండుగ వాతావరణములో ఇప్పటికీ చేయుచున్నారు. కలియుగ ప్రారంభములో ఎంతో పెద్ద ఎత్తున జరుపబడు కృష్ణాష్టమి పండుగ నేడు గుర్తుకు మాత్రము మిగిలియున్నది. ఇటువంటి పరిస్థితి రాకూడదని ఆనాటి పెద్దలు ఒక ప్రయోగము చేశారు. ఆ ప్రయోగమే అష్టమి కష్టము, నవమి నష్టము అనుమాట. ఈ పద ప్రయోగమేమిటని కొందరికి అర్థము కాకపోవచ్చును. ఆనాటి పెద్దలు ఏ ఉద్దేశముతో ఈ పదములను వాడారో గమనిద్దాము.

పూర్వము కృష్ణుడు మధురానగరములో అష్టమి దినమున పుట్టాడు. మరుసటి దినము నందగావ్‌లో కనిపించాడు. పుట్టిన రాత్రే వసుదేవుడు రహస్యముగా కృష్ణున్ని మధురానగరమునుండి ప్రక్కనేనున్న నందగావ్ లోనికి

చేర్చాడు. అందువలన రెండవ దినమున అనగా తెల్లవారిన తర్వాత కృష్ణుడు యశోదకు పుట్టాడని ఆ గ్రామమంతా తెలిసిపోయింది. కృష్ణుడు పుట్టిన అష్టమిరోజు రాత్రిపూట, తెల్లవారిన తర్వాత తిథి నవమి వచ్చినది. గొల్లవాడలలో తెలిసినది నవమిరోజు. నందాగావ్‌లో కృష్ణుడు నవమి రోజు తెలిసాడు. మధురలో కృష్ణుడు అష్టమిరోజు పుట్టాడు. కృష్ణుని యొక్క పుట్టుక అష్టమి రోజు, కావున ఆత్మజ్ఞానము తెలిసిన వారందరు శ్రావణ బహుళఅష్టమి రోజును 'కృష్ణాష్టమి' అను పేరుతో చేసెడివారు. నందగావ్ లోని గొల్లవారందరు కృష్ణుడు తమ గ్రామములో కనిపించిన నవమి రోజున 'గోకులాష్టమి' అను పేరుతో నవమిరోజు ఉత్సవము చేసెడివారు. వారు కులాభిమానము తో తమ పేరు ఉండునట్లు 'గోకుల అష్టమి' అని చేయడము జరుగుచున్నది. ఇప్పటికీ కూడా శ్రీకృష్ణాష్టమి, గోకులాష్టమి రెండు పేర్లతో అష్టమి, నవమి రెండు రోజులు పండుగలు చేయడం జరుగుచున్నది. అష్టమి రోజు జ్ఞానులు చేయునది కృష్ణాష్టమి, నవమి రోజు గోకులవంశము వారైన నేడు యాదవులనబడు గొల్ల కులము వారు ప్రత్యేకముగా చేయునది గోకులాష్టమి అని తెలియవలెను. కృష్ణుని పుట్టుక అష్టమి రోజే అయినా కృష్ణాష్టమి, గోకులాష్టమి అను రెండు పేర్లతో అష్టమి రోజు, నవమి రోజు పండుగ చేయడము జరుగుచున్నది.

కృష్ణ జయంతిని నవమిరోజున చేసినా దానిపేరు గోకులాష్టమి అని అష్టమినే చూపిస్తున్నది. కావున శ్రీకృష్ణుని జన్మ ఉత్సవము అష్టమి, నవమి రెండు రోజులు జరగడము ఆనందదాయకమైన పనిగా తలచ వచ్చును. కలియుగము మొదటిలో దేశవ్యాప్తముగా కృష్ణాష్టమి, గోకులాష్టమి రెండు రోజులు జరిగెడివి. ఆ రెండు దినములలో అందరూ తమతమ పనులను మానుకొని ఉత్సవము చేసెడివారు. ఆ దినములలో ఎవరినీ పనిలోనికి పంపెడివారు కాదు. పనులుంటే కృష్ణుని ఉత్సవములో పాల్గొనరని అన్ని పనులకు స్వస్తి

చెప్పెడివారు. ఆ దినములలో ఎవరికైన, ఏ పనికైనా మంచి ముహూర్తముండినా దానిని చేయక మానుకొనునట్లు, ఎవరు ఏ పని జోలికి పోకుండ పెద్దలు ఒక భయము పెట్టారు. అష్టమి రోజున ఏ పనిని ప్రారంభించినా అందులో కష్టము ఏర్పడుతుందని, ఆ పని సక్రమముగా సాగదని చెప్పారు. అలాగే నవమి రోజున పనిని ప్రారంభిస్తే దానివలన ఎక్కువ నష్టము వస్తుందని చెప్పారు. కృష్ణాష్టమి, గోకులాష్టమి సక్రమముగా జరుగుటకు, అందరు పాల్గొనుటకు అవకాశము ఉండునట్లు ఆ విధముగా చెప్పి భయమును ఏర్పరచి, ఆ రెండు దినములు పనిని మాన్పించారు. ఆ భయము అందరికీ తెలియునట్లు అష్టమి కష్టము, నవమి నష్టము అనుమాటను ప్రయోగముగా వాడి మనుషులలో అందరికీ తెలియునట్లు చేశారు. ఆనాడు వారు చేసినది మంచి ఉద్దేశమే అయినప్పటికి అష్టమి కష్టము, నవమి నష్టము అనుమాట నేటికి ఎవరికీ తెలియకుండా పోయినది. ఆ మాట తెలియకుండా పోవడమే కాక కృష్ణాష్టమిని చేయువారు 90 పాళ్ళు తగ్గిపోయారు.

మనము కృష్ణ జయంతిని పండుగగా చేసినా, చేయకున్నా ఆయన అష్టమి తిథినాడే ఎందుకు పుట్టాడని యోచించితే ఎంతో జ్ఞాన అర్థమున్నదని చెప్పుకొన్నాము కదా! దానిని గురించి వివరించుకొంటే ఈ విధముగా కలదు. అమావాస్య నుండి పౌర్ణమి వరకు 15 రోజులు, అట్లే పౌర్ణమి నుండి అమావాస్య వరకు 15 రోజులుండుట అందరికీ తెలిసిన విషయమే. శ్రీకృష్ణుడు పౌర్ణమి నుండి అమావాస్య వరకు గల 15 దినములందు మధ్యలో గల అష్టమి దినమునందు జన్మించాడు. 15 దినములలో పాఢ్యమి నుండి సప్తమి వరకు 7 దినములు, మధ్యలో అష్టమి, తర్వాత నవమి నుండి అమావాస్య వరకు 7 దినములు గలవు. 7+1+7=15 పదిహేను రెండు సమాన భాగములు చేయవలయునంటే 7 మరియు 7 దినములుగ విభజించగ ఒకటి శేషము మిగులును. ఆ ఒక్క దినము అష్టమిగ గుర్తించి అష్టమికి ముందు 7

దినములుగ, వెనుక 7 దినములుగ గుర్తించు కోవలయును. శ్రీకృష్ణుడు మధ్య దినమైన అష్టమియందే పుట్టుటకు విశేషమైన అర్థము గలదు. అదేమనగా!

భగవంతుడైన శ్రీకృష్ణుడు జ్ఞానమునకు, అజ్ఞానమునకు సంధిలాంటి వాడు. అజ్ఞానము నుండి జ్ఞానమునకు, జ్ఞానము నుండి అజ్ఞానమునకు పోవుటకు ఆయన కేంద్రములాంటివాడు. ఎందరో జ్ఞానులు సహితము ఆయన తన జీవితములో నడుచుకొన్న పద్ధతులనూ ఆచరణలనూ చూచి, ఆయన చెప్పిన గీత అంతా బాగుగానే ఉంది, కానీ ఆయన ఆచరణ మాకు నచ్చలేదు. ప్రవర్తన ముఖ్యము కదా! లోపల గుణములనుబట్టియే కదా ఎవరైనా ఆచరించేది, ఆయన ఎన్ని చెప్పినప్పటికీ శ్రీకృష్ణుడు చేసిన పనులను బట్టి చూస్తే, బోధలు చెప్పినంత గొప్పవాడుకాదని తెలుస్తుందని అంటున్నారు. అటువంటి వారు జ్ఞానమునుండి కృష్ణుని ద్వారా అజ్ఞానములోనికి పోయినట్లే, వారికున్న జ్ఞానము నిష్ప్రయోజనమన్నమాట. శ్రీకృష్ణుడేమి చెప్పాడో వారు అర్థము చేసుకోలేదన్నమాట. అటువంటపుడు శ్రీకృష్ణుడు చెప్పిన అసలైన జ్ఞానము వేరు విధముగ అర్థమై ప్రవర్తనకు భిన్నముగ తోచినపుడు వారు శ్రీకృష్ణునికి భిన్నముగ పోగలరు. శ్రీకృష్ణుడు జ్ఞానకేంద్రమైనపుడు, ఆయనకు భిన్నముగ పోవువారు అజ్ఞానమువైపు పోవుచున్నారనే తెలియాలి. అట్లే శ్రీకృష్ణుని చూచి ఆయన చెప్పినది, చేయునది, చేయించునది అంతా ఒకటేనని తెలిసినవారు జ్ఞానమువైపు సాగిపోగలరు. ఆయనను చూచి ఉన్న చోటునుండి కొందరు జ్ఞానమువైపుకు, కొందరు అజ్ఞానమువైపుకు పోవుచున్నారు. కావున శ్రీకృష్ణుడు అటు జ్ఞానమునకు, ఇటు అజ్ఞానమునకు మధ్యగలవాడని తెలియునట్లు అష్టమిరోజునే ఎంచుకొని పుట్టాడు. శ్రీకృష్ణుడు బహుళపక్ష అష్టమి రోజే ఎందుకు పుట్టాలి? శుక్లపక్ష అష్టమియందు ఎందుకు పుట్టలేదు? దానికి కారణమేమై ఉండవచ్చునను సంశయము కొందరికి రావచ్చును. దానికి మా సమాధానమేమనగా!

